కాగితము కరువువల్ల యువ ప్రచురణలు కొద్ది కాపీలే ముద్రిస్తున్నాము. కాన ప్రతి ఏజంటుకు మేము కావలసినన్ని కాపీలు సప్లయి చేయలేక పోవచ్చును. అట్టి పరిస్థితిలో పాఠకులు తమ కాపీని మిత్రులకు కూడా ఇచ్చి మాకృషిని సార్థకము చేసెదరని భావించుచున్నాము.

# తోకచుక్క

[వ్యంగ్యరచనలు]

"చక్రపాణి"

యువ బుక్ డిపో
మద్రాసు : తెనాలి

# తోకచుక్క

ఈ నాటకం రాయాలనే కుతూహలం నాకు చాలాకాలం నుంచి ఉంది. కాని తీరా రాస్తే ప్రచురించేదాత దొరుకుతాడో లేదో ననే భయంతో ఆగాను. ఈ మధ్య ప్రకటింపబడ్డ కొన్ని నాటకాలూ కథలూ చదివినతర్వాత ఈ నాటకానికికూడా ప్రజల కంటపడే భాగ్యం లభిస్తుందని నమ్మకం కలిగి ఈ పనికి పూనుకున్నాను.

ఈ నాటకాన్ని నేను ముందు ప్లాటు వేసుకుని ప్రారంభించలేదు. ఘటన తర్వాత ఘటన వాటంతట వేవచ్చి ఈ రూపం ధరించినై, చరిత్రమాదిరిగా. నేను వాటికి ఆకారం మాత్రం యిచ్చాను. మామూలు చరిత్రకారుడికి చరిత్ర రాసినందుకు ఎంత ప్రాముఖ్యత యిస్తారో, నాకూ అంతే యివ్వండి. అంతకంటే ఎక్కువ యిస్తానంటే కాదననుగాని, తక్కువమాత్రం వొప్పుకోను.

పోతే, ఈ నాటకాన్నిగురించి రెండు ముక్కలు చెప్పవలసి ఉంది. మానవుడు యంత్రం కాడు. రెంటికీ చాలా తేడా ఉంది. యంత్రం చమురుకూ, బొగ్గుకూ నడుస్తుంది. కాని మనిషలా కాడు. అతన్ని నడిపేయంత్రం వేరేఉంది—హృదయం. అది తైలమూ బొగ్గూ అక్కర్లేకుండానే నడుస్తుంది—నడిపిస్తుంది. ఒకరిదగ్గరనించి తీసుకుంటుంది. మరొకరికి పంచిపెడుతుంది. ఒకర్ని ప్రేమిస్తుంది, మరొకరిచేత ప్రేమింపబడుతుంది. తను ఏడుస్తుంది, ఇంకొకర్ని ఏడ్పిస్తుంది. ఒకరి హృదయాన్నిగానీ, కొందరి హృదయాల్నిగానీ అది

ఆకర్షిస్తుంది. ఒక దేహాన్నిగానీ, పదుగురి దేహాన్నిగానీ అది భోగించాలని చూస్తుంది. కాని దానికి సమాజమూ, శాస్త్రాలూ అడ్డువస్తాయి. ఇవే దీనికి శత్రువులు. హృదయాన్ని కాలికిందపెట్టి నలపటమే వీటిపని. ఐనా ఈహృదయం అప్పుడప్పుడూ వీటిమీద ఎదురు తిరిగి విప్లవాన్ని లేవదీస్తూ ఉంటుంది. అలాంటి ఒక యథార్థవిప్లవమే ఈ నాటకం.

డాట్‌లూ (… …) డాష్‌లూ (——) వాడితే భావాలకు మాంచి ఊతం వస్తుంది. అంచేతనే ఈ నాటకంలో అక్కడక్కడా యివి వాడుతున్నాను. ఇవి చాలవని తోస్తే పాఠకులు వారిష్టమొచ్చినన్ని కలుపుకోవచ్చును. నాకేట్టి ఆక్షేపణా లేదు. పోతే—ఈ నాటకానికి కాపీరైట్ లేదు. ఎవరైనా ఆడుకోవచ్చు. నన్ను సలహా అడిగితేమాత్రం మంచి కల్చరు ఉన్నవాళ్లే యిందులో భూమికలు ధరించటం మంచిదని చెప్తాను. ఇందులో లోపించిన భాగాలు కొన్ని ఉన్నై. నాను రాస్తే అక్కడి మాటలు రాసిపంపుతాను.

## ఒకటవ రంగం

స్థలం:—ఆంధ్రదేశంలో ఒక్క పల్లెటూరు.
కాలం:—ఇరవయ్యోశతాబ్దంలో మూడో దశకం.
పాత్రలు:—ఎంతమందివస్తారో తెలియదు.

పూర్వాభాసము:—పొద్దు నడినెత్తికి తిరిగింది. గుర్రకొయ్యలు నడిమింటికి వచ్చినై. చిమ్మచీకటి. పొగ మంచు తెర అడ్డంపడి, చుక్కలకాంతినికూడా క్రిందికి రానివ్వటం లేదు. ఊరు మాటు మణిగింది. దూరాన సముద్రపు ఘోష—అనాదికాలంనించీ వస్తున్న సముద్రపుఘోష. ఈ ఘోష

ఎప్పుడు చల్లారుతుందో!—ఇంకెన్ని నదుల్ని కలుపుకుంటే చల్లారుతుందో! కాని ఈ ఘోష అందరికీ వినిపిస్తుంది. మరి మానవహృదయాల్లో బయలుదేరే ఘోష?— ఇంకా దూరాన బైరాగితత్వాలు. నిస్పృహచెందిన ప్రేమికుడు ఛద్మవేషం వేసుకోలేడు కదా?

ఇంటి ముంగిట్లో చెట్టుచాటున ఓ వ్యక్తి ఆతురతతో ఎవరికోసమో కాచుకునిఉన్నాడు. మేడ మెట్లమీద అడుగుల చప్పుడు. ఒక స్త్రీ తలలో పూలుసర్దుకుని వయ్యారంగా పైట సవరించుకుంటూ మెట్లు దిగి చెట్టుదగ్గరికి వచ్చింది.

వ్యక్తి—ఇంత జాగేలా సరళా?—(చెట్టుచాటునించివచ్చి ఆ స్త్రీని కావిలించుకోబోయి నిర్ఘాంతపోతాడు.)

స్త్రీ—(నవ్వి) ఏం? ఆగావేం? నేను రంజన్ని!

(ఆ వ్యక్తినోట మాట రాదు. గొంతులోమాత్రం గుర గుర శబ్దం పుడుతుంది. ఆ శబ్దంకూడా. ఇంట్లోనించివచ్చే, గంటలు కొట్టబోయేముందు గడియారంచేసే శబ్దంతో కలిసి పోయింది.)

స్త్రీ—ఏం, మాట్లాడవు? ఈ అర్ధరాత్రప్పుడు సరళతో నీకేంపని? చెప్పూ? రేపుపగలు—

(లోపల గడియారం పన్నెండుగంటలు కొడుతుంది పెద్దముల్లు బలవంతాన చిన్నముల్లునించి విడి ఎడమవుతుంది. బయటిసంభాషణ లోపలికి వినపడుతూ ఉంది. యాభైయేళ్ల శేషయ్య వంటలక్క బంధంలోంచి విడదీసుకుని బైటికివస్తాడు. ఆ వ్యక్తి శేషయ్యనిచూసి గోడదూకి పారిపోతాడు. రంజని భర్తనిచూసి నీరైపోతుంది.)

శేషయ్య—దిగు లెందుకులే రా! మళ్లీ రేపు రాక పోతాడూ? (రంజని భయపడుతూ దగ్గరికి వస్తుంది.) ఎవడా గోడదూకిన హనుమంతుడు?

రంజని—మీ అల్లుడు.

వంటలక్క—(తలుపుచాటునించి) పాపం అల్లుడికోసమే గామాలు పొద్దుటినుంచీ చెట్టుదగ్గర తారట్లాడింది?

రంజని—అల్లుడు . కాకపోతే నాకు మొగుడు రాబో యాడేం !

శేషయ్య—ఓస్ ... ...ఎంత విడిచేశావే?

వంటలక్క—నేను మొదటే చెప్పలా, వీళ్లది తురక సాంప్రదాయం, చేసుకోవద్దని!

రంజని—చేసుకు నిప్పుడు తింటున్నానంటలే!

వంటలక్క—ఎన్ని నేర్చావే?

(శేషయ్యకి కోపంవస్తుంది. కఱ్ఱ తెచ్చి ఒకట్టివేస్తాడు. 'అమ్మో' అంటుంది రంజని. శేషయ్య మళ్లీ కఱ్ఱ ఎత్తుతాడు. చంద్రం వెనకాలగావచ్చి కఱ్ఱ లాక్కొని శేషయ్యనెత్తిమీద కొడతాడు. శేషయ్య దెబ్బతో కూలతాడు. వంటలక్క అడ్డం వచ్చినా లెక్కచెయ్యకుండా ఇంకా రెండుమూడు దెబ్బలు వేస్తాడు చంద్రం. వంటలక్క లబోదిబోమంటే ఆమెను గదిలోకినెట్టి గొళ్లెం తగిలిస్తాడు. రంజని లాంతరుతెచ్చి చూస్తుంది—శేషయ్య అప్పటికే కైలాసం వెళ్లిపోయాడు.)

రంజని—మీ నాయన చనిపోయాడు!

చంద్రం—పీడా వదిలింది.

రంజని—తెల్లారేసరికి పోలీసులు—?

చంద్రం—తెల్లారిందాకా నేని అరణ్యాలో ఉంటేగా?

రంజని—మరి నా గతి?

చంద్రం—నువ్వే ఆలోచించుకో. నీ కభ్యంతరం లేక పోతే నావెంట—

రంజని—నాకేమీా లేదు.

(చంద్రం తంద్రిమొలలో తాళం చెవులు విప్పి పెట్టె తెరిచి డబ్బు తీస్తాడు. ఈలోపల రంజని తనకోకలూ నగలూ సర్దుకుని చిన్నపెట్టె చంద్రాని కిస్తుంది. ఇద్దరూ స్టేషనుకి నడుస్తారు. వీరి వెనకనే యడ్ల రామదాసుతత్వం పాడుతూ బైరాగి.)

> ఈ ఊరికి దారిదేగదా గురురాయలు చెప్పిన దదేకదా ;
> దారికి ఎదురై జోడుకునరములు దాటుచు మిక్కిలి మొరిగెగదా,
> ఎక్కుపైన ఏకాక్షరి కుక్కల కెదురుకొని మద మణచెగదా. ఈ.
> ఊరికి దిగువను జోడుతిత్తులు ఊదుచు ఊదుచు నుండె గదా,
> ఊదగ పూదగ పూరుగదిలి యవి ఉన్నచోటి కెళుతాయిగదా. ఈ.

(బైరాగి తత్వం పాడుతూ వాళ్లని రైలెక్కించి వస్తాడు.)

ఇందులో పాత్రలు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి 'అరణ్యం' నించి బయలుదేరినై. ముందు కేంట్లోకి పోతాయో చూడాలి.

## రెండో రంగం

మద్రాసు చింతాద్రిపేటలో ఒకయిల్లు

పూర్వాభాసము—రంజనీ చంద్రులు మద్రాసుచేరి రెండు రోజులు కులాసాగా తిరిగి, చూడవలసినచోట్లన్నీ చూస్తారు. ఒకనాడు చంద్రం ఊరుకోలేక ఆంధ్రపత్రిక కొంటాడు. దాంట్లో అతనికోసం పోలీసులు తిరుగుతున్నారని ఉంటుంది. వీళ్లు మద్రాసుబండి ఎక్కినట్టు పోలీసులు

కనిపెట్టారు. పట్టియిచ్చినవాళ్లకి బహుమానమనికూడా ప్రకటించారు. అంతే—ఆనాటినించీ వీళ్లిద్దర్లో ఎవ్వరూ మళ్లీ బజారికి రాలేదు. ఒకరికెదురుగా ఒకరు కూర్చుని కాలం గడిపారు. అదే వాళ్ల ప్రేమవృక్షానికి కుఠారఘాతమైంది. విరహమే ప్రేమకు జీవనమనీ, కలయికే ప్రేమకు మృత్యువనీ కవులు వర్ణిస్తూ ఉన్నదేగా. కావాలంటే ఉత్తమకావ్యాలన్నీ తీసిచూడండి—విరహకావ్యాలని తేలిపోతై. గువ్వల్లాగాఉన్న వీరిద్దరూ పదిహేనురోజులకే కోడిపుంజుల్లాగా తయారైనారు. 'తమలపాకుతో తా నిట్టంటే తలుపుచక్కతో నే నిట్టంటి' గా ఉంది వీళ్లసంసారం. రోజూ కీచులాటలు. ఇంకా వేరుపడక లేవు. రంజని తనగదిలో తాను తెచ్చుకున్న పుస్తకాలు చదువుకోనారంభించింది. చంద్రం తనగదిలో వేదాంతగ్రంథాలు ముందేసుకునేవాడు. ఒకనాడు చంద్రం ఎందుకో రంజనిపెట్టె తెరిచాడు. అందులో పుస్తకాలు చూచేవరకు అతనికళ్లు తిరిగినై. వాటిలో కొన్నిటిపేర్లివి:—'మూడుఖూనీల ముగుద' 'కాటిపాప' 'ఏస్కోలాటు' 'వారేపిట్టా' 'దంచూ దానల్లుడా' 'తెచ్చుకున్న మొగుడు.' చంద్రం పిచ్చివాడిలాగా వంటగదిలోకి పోయాడు.

చంద్రం—ఈ పొత్తా లెక్కడివి?

రంజని—నావే.

చంద్రం—ఎందులకివి?

రంజని—చదువుకోటానికి.

చంద్రం—ఎందుకు చదువు?

రంజని—జ్ఞానోపార్జనకు.

చంద్రం—ఇలాంటి పొత్తాలవల్ల అజ్ఞానమే అతిశయిస్తుంది.

రంజని—ఏలాగు?

చంద్రం—స్త్రీలు వివేకజ్ఞానహీనులు. 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' యని శాస్త్రాలు ఘోషించుచునే ఉన్నవిగా!

రంజని—ఘోషిల్లనిమ్ము. నాకొచ్చేలుగనా నేముంది?

చంద్రం—నాయాజ్ఞను తిరస్కరించెదవా?

రంజని—......సలాము చేసెదను, నన్ను విసిగించక అవతలికి పొమ్ము. నాకనేకములైన పనులున్నవి.

(చంద్రం ముఖం మాడ్చుకుని వెళ్లిపోతాడు. ఆరాత్రి వేరుపడకలు, ఇద్దరూ భీష్మించుకున్నారు. ఒకటి, రెండు—పదిదినాలు గడిచినై. ఒకరినొకరు పలకరించుకోకుండానే పనులు జరుపుకునేవారు. ఒకనాటి ముచ్చట.)

చంద్రం—నాకు మంచితీర్థమవసరమని తోచుచున్నది.

రంజని—కూజాయందు నీరున్నది. నిక్షేపముగ త్రావవచ్చును.

చంద్రం—నాకు పాషాణహృదయిని దాపురించినది! (నవ్వును)

రంజని—(మందహాసంతో) నేను రక్కసునిపాలబడితిని.

(చంద్రం అమాంతంగాపోయి రంజన్ని వెనకపాటుగా కౌగిలించుకుంటాడు. రంజని విలాసంగా నెట్టుతుంది. చంద్రం వెనక్కుపడి లేచి గరిటె తీసుకుంటాడు. ఇంతలో పోలీసు ఇన్స్పెక్టరు గదిలో ప్రవేశించి పిస్టలుచూపుతూ ఇద్దర్నీ అరెస్టుచేశానంటాడు. ఇల్లు సోదా చూసినాక వాళ్లని స్టేషనుకు తీసుకుపోతాడు ఇన్స్పెక్టరు.)

'అరణ్యం' నుంచి బయలుదేరిన ఈ పాత్రలు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి 'చెలియలికట్ట'లో పడాలనిచూసినై. కాని, విధి ప్రతికూలం కావటంవల్ల జైల్లో పడ్డవి.

## మూడవ రంగం

పదరాసు సబ్ జయిలు: మధ్యాహ్నం

రంజని చంద్రాలమీద కేసు నడుస్తున్నది. ఇద్దర్నీ వేరువేరు కొట్లల్లో ఉంచారు. రంజని సౌందర్యం చూసి ముగ్ధుడైన ప్లీడరొకడు వీరితరఫున ఉచితంగా వాదించటానికి నడుము కట్టాడు. రోజూ ఉదయం సాయంత్రం వచ్చి పరామర్శచేసి పోతుంటాడు. రంజని తన Sex అంతా exploit చేసి అతన్ని ఆకర్షిస్తూ ఉంది. ఏంలాభం? అతనక్కడ, ఈవిడిక్కడ— ఇద్దరిమధ్య ఇనపకమ్ములు. నిట్టూర్పులకు కవాటాలు కదులుతాయా? పహరా యిచ్చే రహీమ్మియా తుపాకిగోడకానించి నోరు తెరచుకుని గుర్రుపెడుతున్నాడు. అతన్ని మేల్కొలపటానికి రంజని జావళి ఎత్తుకుంది.

సామి సరసకు మరిమరి పిలిచిన పలుకావేమిరా!
నీ కురుల చక్కదనమె చూచి కోరినానురా!
నననాన్న నననన నననాన్నా న్నా నానా నాన్న నా!

(పాట పూర్తి అయింది. మియా లేచి కూర్చున్నాడు. రంజని అతనివంక చూసింది, కులికింది, పైట సర్దుకుంది. మియా జావయ్యాడు. రంజని ఆ ఊపులోనే ముద్దు పెట్టుకుంది. నీరైయ్యాడు, విధేయుడైయ్యాడు. చంద్రాన్ని తెచ్చి ఆమె గదిలో వదిలాడు.)

మామూలుగా, సాయంత్రం ప్లీడరొచ్చాడు రంజని

గదిదగ్గరికి—ఆదృశ్యం చూశాడు. Born criminal ని బాగు చేయటం అసంభవమనుకున్నాడు. వెనక్కు తిరిగాడు. రంజని పిలిచింది. భగ్నహృదయంతో ప్లీడరు దగ్గరికివస్తాడు. చంద్రం తన కొట్లోకి వెళ్ళిపోతాడు. రంజని తిరిగి సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తుంది. ప్లీడరు చిత్తవుతాడు.)

ప్లీడరు—రంజనీ! నా మనోరంజనీ!

రంజని—ఏం బాబయ్యా!

ప్లీడరు—నువ్వు తప్పక విడుదలవుతావని నా నమ్మకం—

రంజని—తమ మేలు మరవను.

ప్లీడరు—మరి నువ్వెక్కడికి పోతావు?

రంజని—ఎవరున్నారు నాకూ?

ప్లీడరు—ఐతే—?

రంజని: తమఇంట్లో తలదాచుకోటానికి చోటుదొరకదూ?

ప్లీడరు—కాని, నువ్వింతకుముందే—?

రంజని—ఛీ, అది మీరు నిజమనుకున్నారూ?... లాలించి కేసతని నెత్తిని వెయ్యాలని చూస్తున్నాను.

ప్లీడరు—నిజంగా?

రంజని—ఆc. నిజంగా!

ప్లీడరు—ముమ్మాటికి ?

రంజని—ముచ్చముమ్మాటికి.

జైల్లో పడటం మూలాన పాత్రలు స్తంభించిపోయినై. ఐనా జైల్లో ఉంటే మార్పురావటం సహజం. కాబట్టి శ్రీ. దే. వేంకటకృష్ణారావుగారు రచించిన 'వాడేవీడు' అనే డిటెక్టివు నవల పాత్రలుగా మారినై. చూద్దాం. ముందైనా ఎడాకని పడతామోలేదో!

## నాలుగవ రంగం

మద్రాసు. ప్లీడరు ఇల్లు.

ప్లీడరు శ్రమ వృథా పోలేదు. రంజని పిడుదలైంది, ప్లీడరింట్లో ఉంటున్నది. కాని కొత్త ఒక వింత, పాత ఒక రోత అని సామెత ఉంది. ఒక పట్టుపంచె కొనండి. ఒక వెండి చెంబు చేయించండి. ఒక గ్రామఫోను కొనండి. నాలుగైదు రోజులు గడుపుతావు. ప్రతి నిమిషమూ నీదానిగానే భావిస్తావు. తనదనేభావం కలగగానే ఆ పొంగు చల్లారుతుంది. ప్రేమకూడా అంతే, ఆఖరికి పెళ్లికూడా అంతే. రంజని కొన్నాళ్లు సుఖంగా ఉంది. ప్లీడరు మధ్యాహ్నం ఇంటిదగ్గర ఉండడు. అదేమిఖర్మమో ఈవిడ వచ్చినాక అతనికి కేసులు కూడా ఎక్కువైనై. ఎక్కువసమయం వాటికే వినియోగిస్తున్నాడు. రంజనికి ఏకాంతం అసహ్యమైంది. ఈమధ్య బైరాగి రెండు మూడుసార్లొచ్చి తత్వాలు పాడిపోయాడు. తిట్టినా సిగ్గులేదు వాడికి. రహీమ్‌కూడా రెండుమూడుసార్లు ఈల వేసుకుంటూ వాకిటిముందుగా పోయాడు. అతనికి చెప్పితే ఈ బైరాగిగాడి పనిపట్టడూ! ఒకనాటి మధ్యాహ్నం రహీం వచ్చి అమాంతంగా రంజనిపైన పడి నలిపివేసిపోయాడు. రంజని మాట్లాడలేకపోయింది. రెండోనాడు బండి తోలించుకు వచ్చాడు.

రహీమ్—నాతో వచ్చెయ్యి! (రంజని మాట్లాడలేదు. సంగీతం విన్న పశువులాగా పరవశమైపోయింది. రహీంకు ఆవేశ మొచ్చింది. పళ్లు బిగపట్టి అన్నాడు) రావూ, రావూ?

రాకపోతే చంపేస్తా నిన్ను?

రంజని—ఎక్కడికి తీసుకుపోతావు నన్ను?

రహీమ్—నిజాం.

రంజని—వెళ్లి—?

రహీమ్—హాయిగా ఉందాం!

రంజని—ప్లీడరో?

రహీమ్—వాడి మొహం—ఆ బొందుగా డేంచేస్తాడు?

రంజని—మరి నీ ఉద్యోగం?

రహీమ్—సెలవు పెట్టాను.

ఇద్దరూ నైజాం చేరి ముసి ఒడ్డున కాపరం పెడతారు. చిన్న సంసారం, ఉంటానికో గుడిసె. తింటానికో మల్ల. పండుకోటానికి కాస్త రేల్లు. ఐనా అక్కడి మైదానానికి వీళ్లే ప్రభువులు. అక్కడ చిన్న చిన్న జంతువులన్నీ వీళ్ల ప్రజలు. వనవిహారాలూ, జలక్రీడలూ వీళ్ల దినచర్య.

ఓ నెల గిర్రున తిరిగిపోయింది. రహీమ్‌లో మార్పొచ్చింది. అన్నం తినడు, కదలకుండా పండుకుంటాడు. అది వ్యాధో మనోవ్యాధో తెలుసుకోవాలని రంజని ప్రయత్నించింది, సాధించింది. ఆవూరి తోళ్ల సాయిబు కూతురిమీదికి పోయిందట రహీము మనస్సు. రంజనికి సుమతి తలుపుకొచ్చింది. చప్పున సారథిగావచ్చిన కరీంను వెంటబెట్టుకుంది. తోళ్ల సాయిబు కూతురుదగ్గరికిపోయి మాట్లాడింది. ఆమెను వొప్పించి రహీంను వొప్పగించింది. ఏమంత త్యాగమిది? ఇలాంటిత్యాగం ఆమెకు రహీం ఇదివరకు జైల్లో చేయలా? రంజనిత్యాగాన్ని దేవుడుకూడా మెచ్చుకున్నాడు—మాత్ర

మూర్తిని కమ్మని దీవించాడు. కాని ఈ దీవనే ఆమెపాలిట శాపమైంది.

రంజని—రహీం! ఇదింకా పెరిగేటట్టుంది. లోపలెవరో జాగాకోసం వెతుక్కుంటున్నారు.

రహీం—ఎలాగన్నా వదిలించుకో—

రంజని—ఎలా?

రహీం—పోగొట్టుకో!

రంజని—నీ బిడ్డ రహీం!

రహీం—బిడ్డకాదు—సైతాన్! గొంతుక పిసికెయ్యి!

రంజని—నావల్ల కాదు!

రహీం—కాదూ?—ఐతే నేనే జారగొడతాను! (తంతాడు. రంజని అతని కాలుముద్దు పెట్టుకోవాలచుకుంటుంది. రహీం వెనక్కు లాక్కుంటాడు) ఏం? వల్ల కాదా?

రంజని—(దీనంగా) నా రహీం! జరా రహమ్—

రహీం—రహమ్ గిహమ్ జాంతానై. ఆరునెల్లదాకా నా మొహం నీకు కనపడదు.

రంజని—మరి నాగతి?

రహీం—కరీం ఉన్నాడన్నిటికీ. వాడికి చెప్పిపోతా.

అనుకున్నంతా అయింది. ఈ పాత్రలు శ్రీ గుడిపాటి వెంకటచలంగారి 'మైదానం' లోకి వచ్చి పడ్డయ్.

## ఐదవ రంగం

నైజాంలో. ముసివొడ్డున ఒక గుడిసె.

మాయాప్రవరుడు వరూధిన్ని వదిలినట్లు రహీం రంజన్ని

వదిలిపెట్టి పోతాడు. పోతే పదహారేళ్ళ, నాజూకైన కరీమే రంజనికి దిక్కయ్యాడు. రంజని నాలుగురోజుల్లోనే వాణ్ణి తనవాణ్ణి చేసుకుంటుంది. వాడు వదలడు, పెంపుడు పిల్లిమాదిరి ఎప్పుడూ ఎదురుగ్గా కూర్చుంటాడు. రంజని వాణ్ణి దువ్వింది, చోచ్చదోలింది, ముద్దు పెట్టుకుంటుంది. అసలే పులిపిల్ల. మనిషిచోల్లు తగిలితే ఊరుకుంటుందా? తిరగబడి కావిలించుకుని పెదిమలతో పెదిమలు వెదికింది. రంజని కసిరింది; పులి తోక ముడుచుకుని పిల్లిఅయి కాళ్ళకు చుట్టుకుంది. రంజని లేవదీసి ఘట్టిగా కావిలించుకుంది.

రంజని—నా కళ్ళు బాగుండదు, యేం?

కరీం—మరి నన్ను ఎందుకు ముద్దు పెట్టుకున్నావు?

రంజని—మీా అక్క ముద్దు పెట్టుకోదూ? — పోనీ మానేస్తాలే!

కరీం—వొద్దు. మానెయ్యవద్దు. నాకు కోపం తెప్పించకు మరి.

తర్వాత రహీం తన్ను ఎందుకు వదిలిపెట్టిపోయిందీ చెప్పుతుంది రంజని. కరీం ఊళ్ళోకిపోయి మందిచ్చేమనిషిని పంపుతాడు. రంజని మంచీ చెడూ ఆలోచిస్తుంది.—"పిల్ల పుడితే యేం చెయ్యను? ఎలా పెంచను? తమ ఆనందానికీ, షికార్లకీ ఆటంకమనేగా రహీం కడుపు వొద్దన్నది? ఆపిల్లకి పాలిస్తూ, ఏడుపు సముదాయించుకుంటూ ఆమురికిలోపడి....
...రహీం తనకంటే దూరదృష్టికలవాడు. అతనికి కోపమొచ్చిందంటే తప్పు మరి?" అనుకుని మందు తింటుంది. మూడురోజులు నరకయాతన పడుతుంది. కరీం ఈమూడు

రోజులూ నిద్రాహారాలుమాని సేవ చేస్తాడు. ఆఖరికి మంత్ర సానితనంకూడా. రంజనికి గండం గడిచింది. కరీం రహీంకి కబురు చేస్తాడు. కాని రంజనికి ఇష్టంలేదు. కారణం, కరీం త్యాగం చూసి అతన్ని అపరిమితంగా ప్రేమించింది. కాని, అతని ఋణమెట్లా తీర్చుకుంటుంది? ఒకనాటిరాత్రి కరీంను పిలిచి పక్కను కూర్చోపెట్టుకుని చెయ్యిపట్టుకుంది రంజని.

రంజని—కరీం, నేను నీకు కావాలా? (కరీంకు అర్థం కాలేదు) ఆవాళ మధ్యాహ్నం — (కరీం మెత్తబడ్డాడు గ్రహించి) నీకు కావలిస్తే ఈరాత్రి అయినా సరే.

కరీం—నీ కవసరమా?

రంజని—(సిగ్గుపడుతూ) నా కిష్టమే!

కరీం—అదికాదు, నేను నీకు అవసరమా? రహీముకు మల్లే కావాలా?

రంజని—నీతో నేను అబద్ధం చెప్పలేనోయి. నేను రహీందాన్నే అనిపిస్తుంది. అందుకనే నాకిష్టముండదు, నేనేం గొప్పదాన్ని పతివ్రతనీ అని కాదు.

కరీం—అయితే ఎందు కడిగావు?

రంజని—నిన్ను సంతోషపెడదామని. ఎందుకంటే నేను రహీందాన్నయినా అతనిమీదకంటే నీపైనే నాకు ప్రేమ ఎక్కువ.

కరీం అవీ ఇవీ మాట్లాడి వెళ్లిపోతాడు. అక్కతమ్ముళ్ల ప్రేమబంధం నానాటికీ దృఢమవుతున్నది. కరీంకు భయం— రహీం ఎక్కడొస్తాడో, ఈ బంధం ఎక్కడ తెగుతుందోనని. నాబాబు, నా చిట్టిబాబు, నాపిచ్చిబాబు, భయపడమాకమని

రంజని ధైర్యం చెప్తుంది. రహీం రానేవస్తాడు. రంజన్ని వెంబడేసుకుంటాడు. కరీంకు కష్టం వేసింది. రంజని ఏం చేస్తుంది? మామూలు స్త్రీ—కాదు, పాశ్చాత్య స్త్రీ చూపించ గలంత ఓర్పూ నేర్పూ చూపింది. ఐనా పొటేళ్లు కలబడ కుంటూ వుంటాయా? ఎంత పాలుపోస్తేమాత్రం పాము పడగ విప్పకుండా వుంటుందా? ఒకరాత్రి రహీంపక్కలో వున్న రంజన్ని కరీం ధైర్యంగా తీసుకెళ్లాడు. ఆకాశాన మబ్బులు. గాఢాంధకారం. ఇద్దరూ పోతూనే వున్నారు.

కరీం—(కావిలించుకుని) నువ్వు నాదానివి... నిన్నిలా నలిపేస్తుంటే నేనోర్చుకోలేను.

రంజని—వుండు కరీం, ఎక్కడికి యింకా?

కరీం—దీదీ, దీదీ... రా, నువ్వు నాదానివి. నాదానివి. రా. (కావిలించుకుని పడవేస్తాడు. ఇద్దరూ ముసివొడ్డున సగం నీళ్లలో సగం ఇసికలో పడతారు) లే, వెళదాం, లే!

రంజని—ఎక్కడికి?

కరీం—ఎక్కడికో?

రం—నేనురాలేను, నేనురాను. వుండు నాకు నిద్రవస్తోంది.

కరీం—రావూ, రావూ? ఇంకా వాడిదగ్గిరేవుంటావా? నువ్వు నాదానివి కావూ? దీదీ, దీదీ నాదీదీ, రా ఇట్లా రా? నీకోసం, ఈ పెదిమెలకోసం, ఈ చేతులకోసం—

ఆరాత్రి చీకట్లో, ఇసికలో, నీళ్లల్లో కరీం రంజన్ని తనదాన్నిగా చేసుకున్నాడు. పరమానంద మనుభవించాడు. సొమ్మసిల్లాడు...రంజని బలవంతాన కనురెప్పలు విప్పింది. ఎదురుగా నల్లటి ఆకారం—చేతులో కత్తి!—తళుక్కున

మెరుపు. అయ్యో! కరీం గయాకాబోతున్నాడు. రంజని హుషారుగా లేచింది, రహీ మనే వ్యాధుడిచేతిలోంచి కరీం అనే పిట్టను వదిలించింది. తన గుండెదగ్గర దాచింది. తన జుట్టుతో, తన శరీరంతో కప్పింది......గాలి స్తంభించింది. శాబ్రోమే తుఫానుకి సూచనలా? సన్నని మూలుగు...రంజని తల ఎత్తింది. చీత్కారం చేసింది...రహీం కత్తిమీద వొరిగి వున్నాడు—అలనాడు దేవబ్రాహ్మడు అక్కఅయితమ్మ ఆన దాటలేక జడ్డిగాలభావిదగ్గర కత్తిమీద వొరిగినట్టుగా.

రంజని—రహీం! రహీం! ఎందు కిట్లాచేశావు? నువ్వు లేకుండా నే నెట్లా బతికేది! నన్నూ చంపు!

రహీం—నిన్ను చంపదలచుకోలేదు. నేనో కరీమో ఒకరిమే బతకాలి. నీకు కరీం కావాలి.

రంజని—నువ్వు చావటమెందుకు, రహీం?

రహీం—నిన్ను విడిచి బతకలేను.

రంజని—విడవట మెందుకమ్మా?

ర: ఆకరీంతో నిన్ను పంచుకుంటాననుకున్నావా? తురకబిడ్డని-

రం: కరీం ఎవడు? నువ్వుముందా నాకు కరీంముందా?

రహీం—నేను ముందైనా, నీకు కరీమే ముఖ్యుడు... ఆడిగావు కాబట్టి చెప్తున్నా... నీ పారిపోయిన తమ్ముడే కరీం. సంఖ్య పెంచుకుంటానికి సాయిబులు కలుపుకున్నారు. వాణ్ణి సరిగ్గా చూడు...

రంజని—(రహీం ముఖంమీద ముఖంపెట్టి ఏడుస్తూ) రహీమ్! రహీమ్! నమ్ము. నీమీది ప్రేమ ఏమాత్రమూ తగ్గలేదు...... నేను నీదాన్నే. నువ్వే కావాలి నాకు. నేను

నీదాన్నే. ఎందు కిట్లా చేశావు రహీం?

రహీం జవాబిచ్చేస్థితిలోలేడు. నోరుమాత్రం తెరుస్తాడు. రంజని ఆఖరిముద్దు పెట్టుకుంటుంది. రహీం అల్లాలో ఐక్యమయ్యాడు. రంజనిపెదెం రహీం పళ్లమధ్య యిరుక్కుపోయింది. రంజని ఎంతనేర్పుగా బయటికి లాగినా పెదెం తెగింది. ఉరుములూ, మెరుపులూ, గాలీ, వెలుతుర్లో రంజని పెదెం చూసి కరీం ఏడుస్తాడు.

కరీం—దీదీ! ఇప్పు డెట్లా?

రంజని—(ఏడుస్తుంది)

కరీం—సైతాన్! చచ్చికూడా పగతీర్చుకున్నాడు.

రం: అతన్నలాఅనకు కరీం! నిన్ను చంపకుండావదిలెట్టలా?

కరీం—సాలా! నన్ను చంపకపోయె చెప్పేవాణ్ణి.

కరీం శవాన్ని కాళ్లతో నీళ్లలోకి నెడతాడు. జోరున వానా, గాలీ. కరీం రంజన్ని లేవదీసి తన భుజం ఆధారమిస్తాడు. పచ్చివోళ్లని తన కండువా కప్పుతాడు. ఇద్దరూ గుడిసెకి బైలుదేర్తారు. గాఢాంధకారం. కళ్లు పొడుచుకున్నా కనిపించటం లేదు. దోవలో పిళ్ల కాళ్ల కేదో తగిలింది. అతనొక మనిసి. లేచి కూర్చుని తత్వ మెత్తుకున్నాడు:—

కుదురుపడుటకు సాధ్యమా, ఇల మూఢులకు మది కుదురుపడుటకు సాధ్యమా॥
సిద్ధముగ నిది నమ్మిమూ మొద్దులకు నెల్లబుద్ధి గలుగ నిబద్ధమా -
ఒద్దికాతో పిన్న పెద్దల హద్దు నిలువక రద్దుజేయుచు,
కొద్ది పనులకు సిద్ధపడుచును ప్రొద్దుగడపే యెద్దులకు॥ మది కుదురు॥
ఎన్ని విధముల దెల్పినా కొన్నాళ్లకైనను విన్న బుద్ధులు మానునా,
తన్ను దెలియక కొన్నిక్రియలను వన్నుగా గల్పించుకొనుచు,
కన్నులాగ్రమునందునున్న ప్రసన్ను నెరుగని దున్నలకు॥ మది కుదురు॥
ఎక్క డెక్కడ దిరిగినా, ఇటువంటివారికి ముక్తిమార్గము — —

రంజనికి ఈ తత్వాలంటే కోపం, భయం. అది విన లేదు, వినకుండానూ వుండలేదు. రంజని కిప్పుడు స్మృతి పోనూలేదు, వుండనూలేదు. బైరాగిపాట లీలగా వినిపిస్తున్నది......ఆకాశం భగ్గున వెయ్యికాగడాలతో వెలిగింది. రంజని కరీంను ఘట్టిగా కావిలించుకుంది...పెళ పెళ—పెళ పెళ—పిడుగు...దగ్గర్లోనే...రంజని ఇంకా ఘట్టిగా కళ్లు మూసుకుంది....అబ్బ...ఈ గండంకూడా గడిచింది రంజనికి...బైరాగిపాట ఆగింది...అమ్మా పీడా వదిలింది.

ఆకాశం తెర తొలగించింది. చుక్కలు కళ్లు చికిలించుతున్నై. చెన్నుడు పగలబడుతున్నాడు. ముసి, ముసి ముసి నవ్వుల్తో గంతులేస్తో పోతోంది.

మైదానంనించి ఈ పాత్రల్ని వేరుచెయ్యాలన్న నా ప్రయత్నమంతా వ్యర్థమైంది. అంచేతనే చివరిభాగంలో శ్రీ గుడిపాటి వెంకటచలంగారి 'మంగమ్మ'ను తీసుకెళ్లి వాళ్లతో కలిపాను. ఇక యిప్పుడు పాత్రల పరిణయం దిగుబడింది. అదికూడా పూర్తి చేస్తున్నా.

శేషయ్య—సంపన్నగృహస్థు.

చంద్రం—శేషయ్య మొదటిభార్య కొడుకు.

ప్లీడరు—ప్రాక్టీసులేని ప్లీడరు.

రహీము—లబ్బిసాయిబు, జైల్లో కావిలిగాడు.

కరీం—చిన్నతనంలో మారుపడిపోయిన రంజని తమ్ముడు.

బైరాగి—ఆంధ్ర సినిమారంగంలోనూ సాహిత్యరంగంలోనూ కంప్లసరీగా ప్రబోధంచేసుకుంటూ తిరుగుతున్న ప్రబుద్ధుడు.

రంజని—శేషయ్య మూడోసంబంధంభార్య.

వంటలక్క, మందిచ్చే మనిషి, తోళ్లసాయిబుకూతురు మొదలైనవాళ్లంతా ఎక్స్ట్రాలు.

# ప్రేమ—పాదరక్ష

ప్రేమలోపడ్డాడు ఆనందం!

సరిగ్గా రోమియో, రావణుడూ, మజునూ, జూలియట్, శూర్పణఖా ఎలాంటి ప్రేమలోపడ్డారో అలాంటి ప్రేమ లోనే పడ్డాడు.

ఇతనూ వాళ్ళమాదిరిగా విరహవేదనపడ్డాడు; అయితే ఏం? చావు తప్పించుకున్నాడు; కాని కన్ను లొట్టపోయింది.

ఆనందం యువకుడు, తాజాయువకుడు. ఆరోగ్యాన్ని చదువుకు ధారబోసినా ఇంకా శరీరంలో ఉష్ణరక్తమూ, నరాల్లో తీపూ మిగిలినై. పైగా వేషభాషలు అతని ఆనం దానికి దోహదమిస్తవి. రూపాయికి పావలావంతు మిగిల్చిన మీసాలూ, పదణాలూ ఆరణాలూ చొప్పున భాగించిన క్రాఫింగు, అహమ్మదాబాదు మిల్లుధోవతీ, బెజ్జాల బనీ యనూ, గ్లాస్కో లాల్చీ, ఇంకా కామియా హెయిర్ ఆయిల్, దిల్ బహార్ సెంటు, లక్సు సబ్బు—సహాయకారులు. ఆనందం నిరుద్యోగికాడు, ఉద్యోగికాడు, ఇన్ కమ్ టాక్సు సీజన్ లో ఇద్దరుముగ్గురు షావుకార్లకు లెఖ్ఖలు సరిచూసిపెట్టీ, మిగతా సమయంలో ట్యూషన్లు చెప్పుకునీ కాలయాపన చేస్తూ వస్తున్నాడు.

ఆనందం యఫ్. ఏ. చదువుతూ మానాడు. ఎందుకు మానిందీ పూర్తివివరాలు తెలియవుగాని ముఖ్యంగా పొట్ట గడవకనే మానాడని చెప్పవచ్చు. ఇతనికి ఆశ్రయమిచ్చి

చదువుచెప్పిస్తూ ఉండిన ప్రొఫెసరు ఎందుకనో ఇతన్ని ఇంట్లో నించి వెళ్లగొట్టాడు. పైగా ఎక్కడా తనకు ఆశ్రయంకూడా దొరక్కుండా చేశాడని ఆనందం అక్కడక్కడా చెప్తున్నాడని మాత్రం సాక్ష్యం తీసుకురాగలను.

విరహంలోపడ్డాడు ఆనందం.

అతనికి అన్నం రుచించటంలేదు. నిద్రపట్టటంలేదు. వెన్నెల వేడిగానూ ఎండ చల్లగానూ తోచసాగింది. పాపం ఆనందం!

ఆనందం ఏకాకి. అతనిగోడు వినేవాళ్లేరు. ఇక అతని శత్రువా, మహాబలశాలి. అతనిచేతిలో ఒకటికి ఐదుబాణాలున్నై. పైగా సహాయమా, కోకిలదగ్గరనించి తెల్లచీరెవరకు అన్నీ! ఏం చేయగలడు ఈ శత్రువుని? శివుడు కాబట్టి ఆకాలంలో తాత్కాలికంగానైనా భస్మం చేయగలిగాడు. ఇప్పుడా కాలమూ మారింది; ఆశక్తులూ నశించినై.

ఐనా అతను ప్రయత్నలోపం చేయలేదు. ఊర్వశి, కృష్ణపక్షము, హృదయేశ్వరి మొదలైన అత్యుత్తమ ప్రణయ కావ్యాలన్నీ చదివాడు; ఎప్పుడూ దగ్గరేపెట్టుకుని పండుకునేవాడు. ఉహుఁ! ఏమీ ఉపశమనంలేదు. కవిత్వం రాయ మొదలుపెట్టాడు. జబ్బు ఇంకా ఎక్కువైంది. దీనితో లాభం లేదని భావకవులందరికీ ఉత్తరాలురాసి మందు తెలపమని కోరాడు. ఒకరిదగ్గరనించికూడా జవాబు రాలేదు.

ఇక వాళ్లమీద కోపమొచ్చి వెంకటచలం పుస్తకాలూ, మాసపత్రికలూ తెగచదివాడు. అతనికి సమస్య

చాలాభాగం పరిష్కారమైనట్టే తోచింది.

చావు తప్పింది ఆనందానికి.

అవును; తప్పినమాట నిజమే. కారుకింద పడికూడా యముడికి తొంటిచెయ్యి చూపెట్టాడు—ఆవాళ ఆదివారం. ఆనందం ట్రామెక్కి పావలా టిక్కెట్టు తీసుకున్నాడు. ఒకటి, రెండు, మూడు, ఎన్నోసార్లు దిగాడు ట్రాము, ఎంతోమంది స్త్రీలని ఇళ్లదాకా సాగనంపాడు. వాళ్ళకి తోడు లేరనే భయం లేకుండా!

చీకటిపడింది. కాదు పడకముందే దీపాలు వెలిగినై.

బ్రాడ్వే. ఆనందం ట్రాములైనుదగ్గర నిలబడి ఏ ట్రాము ఎక్కుదామా అని ఆలోచిస్తున్నాడు. ఇంతలో ఒకావిడ సంచి చేతపట్టుకుని ట్రామెక్కింది. వయస్సు పదహారుకూ పాతికకూ మధ్యన ఉంటుంది.

ఆనందంకూడా ట్రామెక్కాడు.

సెంట్రల్, మౌంట్‌రోడ్, ట్రాము పోతూనే ఉంది. ఆనందం కళ్లతో తినివేస్తున్నాడు—తలమీద పూలూ, మెడ మీది నునుపూ...

ట్రిప్లికేన్ హైరోడ్‌లో ట్రామాగింది. అమనిషిదిగింది.

ఆనందం ద్వంద్వంలో పడ్డాడు; దిగటానికి వస్తాయించాడు.

కిర్! — ట్రాము కదిలింది!

ఆనందాన్ని ఎవరో—ఎవరోకాదు, మల్లాది రామ కృష్ణశాస్త్రిగారి 'తాత' కవడ్డు, యు కవడ్డు! అని వెంట పడుతున్నట్టు తోచింది.

'చప్!'—గ్రామునించి దూకాడు ఆనందం.

"ఎన్నా సామీ, పైత్ కారీలాగుండావే!" అన్నాడు కండక్టరు.

ఆనందం పీడిమాట వినిపించుకోలేదు, వినిపించుకునే స్థితిలో కూడా లేడు. కాలం విలువగల దంటారు. ఇప్పుడు ప్రతి సెకండుకూ విలువ ఉంది. ఈ నాలుగు సెకండ్లూ గడిచి పోతే ఇవ్వాళ ఉదయంనించీ తిరిగిందే కాదు జీవితమంతా కూడా వ్యర్థమైపోవచ్చు.

కలుసుకున్నాడు ఆమెని. చాలు, ఇతనికి ఇక నిశ్చింత.

వందగజాలు కలిసే నడిచారు. ఇక ఎడబాటు. విధి! క్రూరవిధి! అతనికి కనికరముందా? ఉంటే తల్లి చంకలోనించి పిల్లనూ, భార్యపక్క లోనించి భర్తనూ వేరుచేస్తాడా?

ఆగి అతనివంక చూసింది ఆమె. మందహాసంచేసి గుమ్మ మెక్కింది.

చాలు. ఇక తని జీవితం సఫలమైంది. కావలసినంత కవితా సామగ్రికూడా దొరికింది—రాయగలవాడుంటే.

నవ్వు! ఈ ప్రపంచంలో దేనితో దీనికి విలువకడతారు! కాసులుతోనా, మొహరీలతోనా, వజ్రాలతోనా, వైడూర్యాలతోనా? దీనికి ఉపమకూడా దొరక్క వెన్నెలని తెచ్చుకున్నారు! అటువంటి నవ్వు అయాచితంగా లభించింది ఆనందానికి. దీనికోసమై పడిగాపులుపడి ఉండేవాళ్లుండగా ఆనందం కుంటానికేం?

ఎనిమిది, తొమ్మిది, తొమ్మిదిన్నర. ఆఖరిట్రాముకి వేళవుతున్నది. ఆనందం మధ్యమధ్య ఈలవేసుకుంటూ పచారు

చేసినా ఆయింటిముందే నిలబడిఉన్నాడు.

బస్!—ధన్!—చచ్చాను!

ఆనందానికి స్మృతితప్పింది, డ్రైవరు కారు ఆపకుండా కేసు తప్పించుకున్నాడు. పోగయిన జనం ఆనందాన్ని కొందరూ డ్రైవర్ని కొందరూ తిట్టారు!

కన్ను లొట్టపోయింది ఆనందానికి.

ఈ ప్రపంచంలో ఇంకా మంచివారూ బుద్ధిహీనులు ఉన్నారు. అందుకనే ఒకరికి అడ్డపడటం తను ఇబ్బందిపడటం ఇంకా ఉంది.

రామశాస్త్రి బ్యాంకీ గుమస్తా. జీతం స్వల్పం. నలుగురుపిల్లలూ, భార్యా, తనకు జాలివేస్తేనేం, నలుగురూ చెప్పటంవల్లనైతేనేం ఆనందాన్ని ఇంటికి తీసుకొచ్చాడు. పక్కనే కొత్తగా ప్రాక్టీసుపెట్టిన డాక్టరొకాయనుంటే పిలిపించి చూపించాడు. ఆయన రోగికి కట్టుకట్టి, మందిచ్చి మంచుగడ్డ తలమీద కట్టుతూఉండమని చెప్పాడు. వెళ్లేటప్పుడు రోగికి మరేమీ ప్రమాదంలేదని కూడా ధైర్యం చెప్పాడు.

మర్నాడు ఆనందానికి స్మృతి వచ్చింది. కళ్ళు తెరిచి చూశాడు. ఎవరు తనదగ్గర నిలబడింది. తన ప్రేయసికాదే!

ఆనందం నిరాశతో కళ్ళుమూసుకున్నాడు.

"పళ్లరసం!" ఆనందం కళ్ళు తెరిచాడు, ఎవరేమె? అతని ప్రేయసికాదే! ఐనా రసం త్రాగాడు.

"మంచు!" ఆనందం కిక్కురుమనకుండా పుచ్చుకున్నాడు!

కొంచెం ఉలుసుచిక్కింది ఆనందానికి.

"ఇవ్వాళ ఎలాఉన్నది?" అన్నాడు రామశాస్త్రివచ్చి.

"కొంచెం నయమే"అన్న దావిడె.

ఈమె గొంతులో ఎంత మాధుర్యమున్నది!

పక్కనేకూర్చుని ఈమె ఆనందానికి విసిరేది. నొప్పులుగా ఉన్నవంటే కాళ్ళుకూడా నవరించేది. ఆ స్పర్శలో ఎంత మృదుత్వముంది!

ఆనందానికి కొత్తజబ్బు నయమైంది. పాతజబ్బు తిరగబెట్టింది.

మధ్యాహ్నం:

రామశాస్త్రి ఆఫీసుకెళ్ళాడు. పెద్దపిల్ల లిద్దరూ బళ్లోకి పోయారు మూడోపిల్ల పొరుగింటికిపోయింది ఆడుకోటానికి, చంటిపిల్ల తల్లిదగ్గరనే ఉంది.

"దాహం!"

పిల్లని పడుకోబెట్టి ఆమె గ్లాసుతో నీళ్ళు తెచ్చిఇచ్చింది.

ఆనందం ఒక్కగుక్కను నీళ్లన్నీ తాగాడు. అయినా అతని గొంతు ఎండుకుపోతున్నది. నోటినించి చాలాసేపటి వరకు మాట పెగులలేదు.

"మీ బావి — కాదు — పంపునీళ్ళు ఎంత రుచండీ!" అన్నాడు పట్టుకుపోయిన గొంతుతో.

ఆమె మాట్లాడలేదు.

"తాతగారేమవుతారండీ మీకు? అన్నాడు" ఆనందం, తన తెలివికి తానే సంతోషిస్తూ.

ఆమె నవ్వింది.

ఆనందానికి ప్రోత్సాహం లభించింది. "మిమ్మల్ని చాలా బాధ పెడుతున్నారండీ, ఆయన. మీ అవసరా

లేమిటో కూడా ఆయనకి తెలియవనుకుంటాను."

"కొద్ది జీతంతో ఇంతమంది బతకాలాయె, కష్టపడక ఎలా తప్పుతుంది? అదీకాక నాకేమంత పెద్ద అవసరా లేడ్చినై!" అన్నదావిడ పోబోతూ.

"మాటండీ! మిమ్మల్ని ఒకటి అడగాలనుకుంటున్నాను. మీరొప్పుకుంటే ఇక్కడే ఉండిపోవాలని ఉంది."

"నన్నెందుకు? వారినే అడగండి."

"కాదులెండి మీరొప్పుకుంటే చాలు, వారి నడగట మెందుకు?"

ఆమె మాట్లాడలేదు.

"ఏమిటి?"

"చెప్పండి"

"..........." అడిగేశాడు, ధైర్యంచేసి.

ఆమె కళ్ళు ఉరమలేదు. తిట్టలేదు. అసలు మాట్లాడనే లేదు. పెదాలు బిగబట్టి నవ్వు ఆపుకుంటూ వెళ్ళిపోయింది.

సాయంత్రం:

రామశాస్త్రి రెండుమైళ్ళునడిచి ఆదరాబాదరా ఇంటికి చేరుకున్నాడు. కోటూ, తలగుడ్డాతీసి వంకెకు తగిలిస్తూ ఉండగా భార్య గదిలోకిపోయింది. ఏమో గుజగుజా చెప్పింది భర్తతో. రామశాస్త్రి 'ఊఁ' అన్నాడు. అంతే.

ఆనందంలో తన్మయుడైపోయాడు ఆనందం. పక్కమీద పండుకుని ఆకాశసౌధాలు నిర్మిస్తున్నాడు.

రామశాస్త్రి బాటాబూట్లు టకటక లాడిస్తూవచ్చాడు గదిలోకి!

"లుచ్చా! చండాలుడా!..." రామశాస్త్రి గొంతు పట్టుకుపోయింది. మనిషి నేలమీదికి వంగాడు.

"ఎవర్ని స్వామీ అలా కోప్పడుతున్నారు!" అని నవ్వుతూ లేచి కూర్చున్నాడు ఆనందం! దౌర్భాగ్య ఆనందం; భవిష్యత్తు తెలియని ఆనందం!

నారితెగిన ధనస్సులాగా నిలబడ్డాడు రామశాస్త్రి. ఆతని నోటిమాట లేదు! పలుకు లేదు!

"ఫట్!"— ధ్వని.

"చచ్చాన్రో బాబో!"—ఆర్తనాదం.

ఆనందం ముఖంమీద వాలింది, రామశాస్త్రి పాదరక్ష!

# వెంకటచలం వేట

## సంక్రాంతి రాత్రి: మొదటిజాము

[ బడిపంతులు కొండయ్య ఇల్లు. దాన్ని ఇల్లనటంకంటే కోళ్ళ గూడంటే కొంతవరకు ఆ దృశ్యం కళ్ళకు కట్టినట్టుంటుంది! కొండయ్య పక్కదాగ్గ నములుతూ నులకమంచంమీద కూర్చున్నాడు. ముఖాన ఆతురత కనిపిస్తున్నది. పొరుగింటి గ్రామఫోనులో క్షేత్రయ్యరాగాలు. కొండయ్యలో వికారం ప్రారంభమవుతుంది. గాలికి తలుపు కదులుతుంది. వెంకటచలం క్యూపిడ్ వేషంతో ప్రవేశిస్తాడు. ]

కొండయ్య:—మళ్ళీ వచ్చావెందుకూ?

వెంక:—ఎందుకోయ్, అంతగాభరా! నన్ను చూస్తే భయమెందుకూ?

కొండ:—భయంకాక! అబ్బ!—చూడూ, నాకొంప? ఇక్కడేముందని వచ్చావు?

వెంకట:—పిచ్చివాడా! నేను నీకొంపలో కూర్చోటానికి వచ్చానా? నీకోస మొచ్చాను. నువ్వు నా భక్తుడివి?

కొండ:—నేను నీ భక్తుణ్ణికాను, నువ్వు నాభగవంతుడివికావు. పో, పో! నన్నొదిలిపెట్టు. ఇప్పటికే నాకు అరడజనుమంది పిల్లలు! పడికట్టురాళ్ళలాగా—

వెంకట:—చాలు, చాలు! నీపిల్లలసంగతి నాకు పట్టలేదు. నాపనెల్లా—(విల్లుతీస్తాడు)

కొండయ్య:—(చేతులడ్డంపెట్టి) ఆగవోయిబాబూ, ఆగు! నేనిప్పటికే పిల్లల్తో హైరానైపోయాను. ఏటేటా కాన్పులతో అది లేచేస్థితిలో లేదు. జుట్టురాలిపోయింది. మనిషిని

చూస్తే నిర్వేదంకూడా కలుగుతోంది.

వెంకట:—నిర్వేదమా? నీకా? (పక పక నవ్వి) నీకూడా అర్జునుడిమాదిరిగా గీతోపదేశం కావాలా? పిచ్చి వాడా! నీ తెలివితక్కువతనంచూస్తే నాకు కోపమొస్తోంది.

కొండ:—నామీదొస్తే వొచ్చిందిలే, దాన్ని చూస్తైనా జాలిపడు! ఈ స్థితిలో మళ్ళీ కడుపు—

వెంకట:—నిజమేనోయ్! ఆమెనిచూస్తే జాలి కలుగు తుంది—కాని నిన్నెలా వొదిలేది? నీకు మనోనిగ్రహం లేదు బొత్తిగా! వెన్నెలచూస్తే విరహవేదనపడతావు. ప్రేమ కావ్యం చదివితే ప్రలాపన సాగిస్తావు! జావళీవింటే—

కొండ:—ఏం చేయమంటా? మాంచి సంకటంలో పడ్డాను! ఇటా, మిమ్మల్ని ఎదుర్కోలేను. అటా, దానిఅవస్థ చూడలేకుండా ఉన్నాను! ముందునూయి, వెనుక గోయి!

వెంకట:—ఎందుకోయి అబద్ధాలు! నువ్విప్పుడు తిట్టు కోటంలేదా మనసులో—నీభార్య త్వరగా పనులు ముగించ నందుకు?—

కొండ:—పోనీయండి, ఇప్పుడా గొడవ ఎందుకు?— ఒకసంవత్సరందాకా నామీద 'పిటీ' చేసి వదిలిపెడితే బతికి పోతాను. 20 రూపాయల జీతంతో ఎంతమందిపిల్లల్ని పోషించ గల్ను. ఇప్పటికే మొలలోతు అప్పుల్లో మునిగాను—

వెంకట:—నీఅప్పుల సంగతి నా కనవసరం. నీకుటుంబ గొడవలు నాకంతకంటే అక్కర్లేదు!—నన్నుపాసించే భక్తు లెంతోమంది హాయిగా పిల్లాజల్లా లేకుండా ఉన్నారు. నీకు బుర్రలేకపోతే నేనేంచేసేది?

కొండ:—నువ్వేం చేస్తావులే! నా తెలివితక్కువని నేనే తిట్టుకుంటున్నా.

వెంకట:—అదీ, అలారా దారికి! ఇకముందు నన్ను చూస్తే భయపడబోకు.

కొండ:—ఎలా? ముందుభయం పోవాలిగా!

వెంకట:—పోతుందిగా! సరే, నువ్వు బర్తుకంట్రోలు సంగతెప్పుడైనా విన్నావా?

కొండ:—వింకేం! చండాలపుపని—పాపంకూడా!

వెంకట:—పాపమా? పందుల్లాగా పిల్లల్నికని ఊరుమీద వదలటం పాపంకాదూ? వాళ్ళకి చదువు సంధ్యల్ని చెప్పించకుండా ఉండటం పాపం కాదూ? ఇరవైరూపాయల జీతం సతిండికే చాలదని నువ్వు నీ బాధ్యతనీ, పిల్లలబాధ్యతనీ, భార్యబాధ్యతనీ, వదులుకుంటావా?

కొండ:—అబ్బ! నా కళ్లు తెరిచావు. ఇకముందు నా బాధ్యత నేను నిర్వహిస్తాను!

వెంకట:—అదీ! (కొండయ్య వీపుతట్టి) ఇక నన్నుచూస్తే భయముండదు! నాపని నేను చేసిపోతూఉంటాను, నీపని నువ్వుచేసుకో!

## రెండోజాము

[నరసింహారావు తండ్రిఇల్లు, రామశాస్త్రిలు "హరేరామ హరేరామ, రామరామ హరేహరే" అన్న స్తోత్రాన్ని వల్లిస్తూ ఉంటాడు. వెనుకెటి వేషంతో వెంకటచలం ప్రవేశం.]

వెంకటచలం:—ఎందుకు శాస్త్రిల్లూ! నోటికి వృథాగా శ్రమ? చిత్తం స్త్రీ మీదికి లాగుతుంటే భక్తి రాణిస్తుందా?

శాస్త్రి:—వచ్చావు నువ్వు? లాభంలేదులే ఇవ్వాళ!

వెంకట:—ఏం?

శాస్త్రి:—వేరేకాపురం పెట్టిందిగా!

వెంకట:—వేరేకాపురం పెట్టితే నువ్వు నిరాశచెంది ఊరుకోవలసిందేనా? (నవ్వి) పిచ్చివాడా! హనుమంతుడిమాదిరిగా నీశక్తి నీకు తెలియటంలేదుగాని, నువ్వు తలుచుకుంటే సాధించలేని కార్యమేముంది?

శాస్త్రి:—ఏదో, ముసలివాణ్ణయాను! నన్నొదిలిపెడితే—

వెంకట:—ఛా! ఛా! నీనోట యిటువంటిమాటలు వింటూనికే సిగ్గేస్తోంది! నీముందు ఈకాలపుకుర్రవాళ్లు దమ్మిడీకి పనికివస్తారా? ఈ అరవయ్యేయేటకూడా నీకున్న దేహపుష్టి, తిండిపుష్టి, నరాలపుష్టీ ఎంతమందికుంది? ఇప్పటివాళ్ళంతా పిరపకారు, ఉడుగుపిందెలు—

శాస్త్రి:—ఐతే ఏంలాభం? నన్నుచూస్తే అంతా బెదిరిపోతుంటిరి. నువ్వు సందర్భాసందర్భాలు గమనించకుండావస్తే—

వెంకట:—శాస్త్రుల్లూ! నీబోటివాడే ఇంత నిరాశపడితే నే నేమవుతాను! లే, లే. ఒకమాటు ఏదో కాదన్నదని నువ్విలా చేతులు కట్టుకుకూర్చోటం లాకీగాలేదు. రా, లేచి!

శాస్త్రి:—బాగాఉందీ పొద్దు! నన్నిప్పు డేం చెయ్యమంటావు?

వెంకట:—నువ్వు చేసేదేముంది? నీ అవసరమే దానిమార్గాన్ని వెతుక్కుంటుంది.

శాస్త్రి:—ఛీ! నీది ఉత్త మూర్ఖపుపట్టు!

వెంకట:—ఏంచెయ్యను? నీప్రకృతినిబట్టే నాపట్టు! నీవు నో

బలాన్ని బట్టి నేను విజృంభిస్తూ తగ్గుతూ ఉంటాను. శాస్త్రీల్లూ! నీ సనాతనప్రకృతి నాకు బాగా నచ్చింది. లే— బయలు దేరూ!— ఊఁ!

శాస్త్రి:—ఎక్కడికీ?

వెంకట:—ఇంకెక్కడికి? కోడలుపిల్ల దగ్గరికే! మీా వెధవ ఇవ్వాళపోట్లాడి గుళ్లోకిపోయి పండుకున్నాడు—

శాస్త్రి.—నిజంగా! సరిగ్గా చూశావా నువ్వు?—నువ్వు పోలీసుల్లో ఉండదగినవాడివోయి!

వెంకట:—అలాగే — ఊఁ, బయలుదేరూ? — నాకు చాలాపనులున్నై!—అవిగో చీరెలు, తీసుకో! ఆఁ—చంకను పెట్టూ—ఉత్తరీయం కప్పూ—

శాస్త్రి:—ఎవరన్నా చూస్తే?

వెంకట:—చూస్తే ఏం?—'కామాతురాణాం నభయం నలజ్జా!' అని శాస్త్రం ఘోషపెట్టుతూఉండె. అదీకాక, కొడుకు యింటికి పోతుంటే ఎవ రనుమాన పడతారు?

శాస్త్రి:—భేష్! నువ్వు చాలా తెలివిగలవాడివోయి! సరే, లోకభయం వదులుకున్నా ఇంట్లో ముసిలిదాని సంగతి?

వెంకట:—చాదస్తుడా! అనేకపురాణాలు వినిపుంటావు, ఇదేనా గ్రహించింది? హిందూస్త్రీలు పతివ్రతలు! సుమతీ—

శాస్త్రి ఐతే పద! అందాకావచ్చి దానితో కూడాకాస్తే-

వెంకట:—అలాగే!—ఒకచేత్తో చప్పటమోగదుగా! రా, అసలునీకోసమే ఎదురుచూస్తూంది! పోయిచెదిరిన కాపరాన్ని ఇలవేలుపై నిలబెట్టు!

## మూడోదృశ్యము

[ వెంకట్రామయ్యఇల్లు. సుందరమ్మ కిందగదిలో మంచంమీదపండుకుని పుస్తకం చదువుకుంటున్నది. చుట్టూ చిల్లరపత్రికలు, పాతివి. అన్నీ విధవావివాహాన్ని గురించి చర్చించినవే. పురుషదౌర్జన్యాన్ని నిరసించినవే! సుందరమ్మ చేతులో పుస్తకం విసుగుతో నేలకొట్టుతుంది. దెబ్బ తగిలినచోటినించి పొగలేస్తుంది. అందులోనించి మదనుడివేషంతో వెంకటచెలం ప్రత్యక్షమవుతాడు. ]

సుంద:—ఎవడివోయి నువ్వు? నీ కిక్కడేం పని?

వెంకట:—నేనా?—సరిగ్గా లేచికూర్చో!...ఆఁ, ఇప్పుడు గుర్తుపట్టావా?—ఇకపనా? నీకు తియ్యటిబాధ కలిగించటమే!...అదిగో సిగ్గెందుకూ నాదగ్గర; పైట సర్దుకో మాకు!... తలవొంచుకో మాకు!...అలాగే...

సుంద:—ఛీ! ఏమిటి, పాడుమాటలు! ఫో, నాదగ్గరనించి! మేమలాంటివాళ్లం కాము!

వెంకట;—పోవాలీ? (పకపకనవ్వి) అమాయకపుపిల్లా! నీశరీరం యౌవనంతో పొంగి పొర్లుతోంది. నీలాంటిదాన్ని వదిలిపెట్టితే నేను సృష్టికి సమాధానం చెప్పలేను. నువ్వు జోడు చూసుకోవాలి.

సుంద:—అలాంటి తప్పుపని నేను చెయ్యను. ఏదో ఒక మాటు పెళ్లాడాను. సుఖమనుభవించాను. ఇంకా ఎందుకు అలాగావాళ్లకి మళ్లె? నేను కామాన్ని అణుచుకోగల్ను.

వెంకట:—ఇలాంటి కోతలు నేను చాలామందిదగ్గర విన్నాను. ప్రకృతికి విరుద్ధంగా నువ్వెక్కడనించి ఊడిపడ్డావు? —కాస్తె చదువు కున్నావు గామాలు, పుస్తకాలు చదివి చూడూ? మగవాడూ ఆడదీలేనిపుస్తకం ఉందా?—అందాకా ఎందుకూ? నీకే ఈ వొంటరిజీవితం బావుందా? నిజంగా నువ్వు

చచ్చిన భర్తనే తలుచుకుంటున్నావా? నీలో వికారమేమీ లేదా? రెండుఝాముల్లైనా నీకు నిద్రెందుకు పట్టలేదూ?

సుంద:—నాలో ఏవికారమూ లేదు! ఫో, అవతలికి!—ఆడ దాన్నని కామాలు, మరీ పైపైకి వచ్చి కవ్విస్తున్నావు? అప్పు డెక్కడికిపోయా, మాఆయన బతికుండగా! సరే! పో! ఆయన ఈచుట్టుపక్కలే దెయ్యమై తిరుగుతున్నాడు. చూశాడంటే పీక్కుతింటాడు. ఫో. తొందరగా...

వెంకట:—పిచ్చిపిల్లా! దెయ్యాలు మనుష్యుల్నేమీ చెయ్యవు! నువ్వు భయపడమాకు, నన్నూ భయపెట్టమాకు! —ఇదుగో, నువ్వెంత బుకాయించినా లాభంలేదు. నాకు లొంగిపోయావు! నాబాణాలు నిన్ను తల్లకిందుచేసినై! అదుగో నీ నిట్టూర్పులేమి చెప్తున్నాయి?—నీ కళ్లలో కనిపించే ఆజాలికి అర్థమేమిటి? నీశరీరంవంక వోమాటు చూసుకో? పురుషవిరహాగ్నికి కంది పోయింది. నీపెదాలు వణుకుతున్నై. అదుగో, నీగుండె అలల మాదిరి లేచి పడుతోంది! వెర్రిదానా! బ్రహ్మచర్యం మాటలా? మహర్షులెల్లా నాకు దాసులయ్యారే! వాళ్ళకంటే నువ్వు గొప్పదానివా? పురుష సావాసం...

సుందర: నాకక్కర్లేదు! నేనటువంటివన్నీ అణచుకోగలను.

వెంకట:—అణుచుకుంటూ? (నవ్వి) నువ్వణచిన కొద్దికీ నే నెక్కువౌతాను! నాదాడి నువ్వెదుర్కోలేవు—

సుందర:—ఏమిటోయి, నీగోరవ? అసలు నాజోలి నీకెం దుకూ? నేనిప్పుడే చెప్తున్నా, నాదగ్గరికి రామాకు. బావుం డదు! నేను బతికినంత కాలం బ్రహ్మచర్యమే పాలిస్తాను.

వెంకట:—ఎందుకు నీకంత అహంకారం? నువ్వు కట్టుకున్న,

బ్రహ్మచర్యమన్నే, గాలికోట నావింటి ఝంకారానికే ఎగిరి పోతుంది. ఒకవేళ నిలిచినా నువ్వనేక రోగాల్ని ఎదుర్కో-వలసి ఉంటుంది. హిస్టీరియా! ఫిట్సూ—నిజమేనంటావా?

సుందర—పుస్తకాల్లో అలాగే రాసి ఉంది!

వెంకట:— ఐతే ఎందుకు వృధాశ్రమ? నిజం చెప్పు, నీ అంతరాత్మ ఏమంటోంది? పురుషసహవాసం కోరటంలేదా?

సుందర:...ఊఁ...

వెంకట:—ఎంత భయంతో తల ఎగురవేశావు?...ఇక ముందు నన్ను చూస్తే భయపడమాకు, సిగ్గుపడమాకు. మంచి వాడెవడూ దొరక్కపోతే ఆచంద్రశేఖరం వెధవతోనే జోడుకట్టు.

సుంద:—మీమాట కాదంటానా!

వెంకట:—అదీ! ఇప్పుడు మంచిపిల్లవి!...తలతిక్క వేషాలు వేయమాకు, రేపు మళ్ళీ కనపడతా.

## నాలుగో ఝాము

[ పంచాననతీర్థుల ఆశ్రమం. దూరానమాలపల్లెలో కోళ్లుకూస్తున్నాయి. శిష్యులిద్దరూ ఇంకా నిద్రలో ఉన్నారు. తీర్థులు పులిచర్మంమీద కూర్చునిధ్యానమగ్నుడు కావాలని ప్రయత్నిస్తున్నాడు. అతనికి ఏకాగ్రత సిద్ధించటంలేదు. ఎదో వచ్చి అతని వెన్నుకి చల్లగా తగులుతుంది. ఒళ్లు ఝల్లుమంటుంది. కోపంతో కళ్లు తెరిచి చూస్తాడు. ]

వెంకట:—ఏం తీర్థులూ? అట్లా చూస్తావేమిటి, భస్మం చేస్తావా? (తీర్థులు మాట్లాడడు. తాటాకుమీద ఘంటంతో ఏదో రాసియిస్తాడు.) ఏమిటీ, నువ్వు తీర్థులువికావూ?... అనంగశృంగభంగుడివా?—ఈవేష మెన్నాళ్ళ నించీ? తాటి పర్రునించి ఇక ఇదేనా మకాం?—ఏం మాట్లాడవు? నా దగ్గరా నీమౌనం? (నవ్వి) నీకీర్తి దేశమంతటా పాకిపోయింది.

తీర్థులు:—నాకీర్తా?

వెంకట:—ఆఁ. చెలం నీకథంతా రాసి పత్రికలో వేశాడు.

తీర్థులు:—ఎవడా చెలం? నాసంగతెందుకు, వాడికి?

వెంకట:—వాడు మా సి. ఐ. డి. ఆంధ్రదేశంలో చాటున నీలాగా గడ్డికరుస్తూ తిరిగేవాళ్ళని బయటపెట్టటమే అతని హాబీ. జీతం ఏమీ తీసుకోడు.

తీర్థులు:—బయటపెట్టి నన్నేంచేస్తాడు?

వెంకట:—ఇంకేం చెయ్యాలీ? ఇకముందు నీకు శిష్యురాండ్రు దొరకరు. అల్లరైన స్వామిదగ్గరికి ఏ ఆడది వస్తుంది? నిన్ను ఏవూరూ చేరనివ్వరు, పిల్లలు గడ్డ లేస్తారు.

తీర్థులు:—సన్యాసిని! నా కొకర్తో ఏంపనీ?

వెంకట:—నీకు లేకపోయినా, నాకు ఏడ్చిందోయ్ నీతో, దొంగసన్యాసీ! ముందునువ్వు ఆశ్రమం ఎత్తేసి ఆస్పత్రిలో చేరు. రెండునెల్లు మందుతీసుకుని వజ్రకాయంతో బయటికిరా.

తీర్థులు:—వచ్చి లోకాన్నేం ఉద్ధరిస్తాను?

వెంకట:—లోకాన్ని పీడించకపోతే ఉద్ధరించినంతఫలం!

తీర్థులు:—నన్నెలా చావమంటావు చెప్పూ? లోకాన్ని పీడించకుండా ఎట్లా ఉండేది?

వెంకట:—వివాహం! మదనరాజ్య పట్టాభిషేకం!

తీర్థులు:—నాకు రాణీ ఎక్కడ దొరుకుతుంది?

వెంకట:—పున్నమ్మ ఉందిగా! పోయి చెంపలు వాయించుకుంటే వచ్చేస్తుంది!

తీర్థులు:—మళ్ళీ నేనీ రొంపిలో దిగలేనుబాబూ! వెంకటి సంగతులు నీకు తెలుసుగా, ఇలాగే కళ్ళుమూసుకుని కాలం

వెళ్లబుచ్చుతాను.

వెంకట:—నువ్వు వెళ్లబుచ్చలేవోయి. నీకు మనోబలం లేదు!—సరే. నువ్వు తాడిపత్రినించి పారిపోయి వచ్చి నెల రోజులు కాలేదుగదా, నన్నెందుకు పిలిచావు?

తీర్థులు: ఊరకనే! నిన్ను చూస్తూ నిగ్రహం నేర్చుకుందామని.

వెంకట:—ఏడిశావు. నన్ను చూడకముందే నీ నిగ్రహాలన్నీ—తర్వాత నా దాసుడివే! చూడు, ఇప్పుడు నిన్నేం చేయించమంటావు?—గంతు లేయించమంటావా? జావళీలు పాడించమంటావా?—ఈలలు వేయించమంటావా?

తీర్థులు:—ఏదీ వొద్దు. నన్నొదిలి పెట్టు!

వెంకట:—ఐతే నిన్నక్కడ వదల్ను, పోయి ఆస్పత్రిలో చేరితే, రెండు మాసాలదాకా దగ్గిరికి రాను.

తీర్థులు:—ఐతే నాకిప్పుడు సిద్ధి లేదన్నమాట!

వెంకట:—ఉహుఁ—రెండుమాసాలు ఆస్పత్రిలో తపస్సు చేస్తే నీకు సిద్ధిస్తుంది, పున్నమ్మ! అదే నీ సిద్ధి! లే, లే, మళ్ళీ శిష్యులు లేస్తారు.

తీర్థులు:—ఈ వేషంతోనా?—ఆస్పత్రిలో!

వెంకట:—రంగయ్యని గుడ్డలుంటే చూడూ, ఒకజత.—ముందు బొనుకిపోయి క్రాపూ గడ్డమూ చేయించు! ఎవ్వరూ గుర్తుపట్టరులే—డబ్బుందిగా రొంటిన?

తీర్థులు:—చేర్చుకుంటారూ నన్ను?

వెంకట:—దివ్యంగా! వెనీరియల్ వార్డులో చక్కటి బెడ్ యిస్తారు. కాదంటే కాషాయగుడ్డల మూట తియ్యి.—మఃగ నర్సులే లే! ఏం భయపడ మాకు! ఊఁ పద—

# మ హా ని య ం త

నేను కవిని; నిరంకుశుణ్ణి.

నేను లేఖకుణ్ణి; నియంతని.

నేను రాయటానికి కూర్చుంటే "ఎందుకు రాయాలి?" "రాస్తే లాభమేమిటి?" అనే ప్రశ్నలు—అనవసరపు ప్రశ్నలు నా కెప్పుడూ కలగవు. అందరి రచయితల మాదిరిగానే నాకూ దేవుడిచ్చిన ప్రతిభ ఉందనీ, నా రచనామృతాన్ని జుర్రుకోటానికి రసపిపాసులు ఎంతోమంది నోరు తెరుచుకు ఎదురుచూస్తూ ఉంటారనీ నమ్ముతాను. ఏదో పై మాటకి ఎదురుచూస్తూ ఉంటారని అంటున్నాను గాని తప్పక ఎదురు చూస్తూనే ఉంటారు. అందుకనే నా రచనను ప్రకటించిన పత్రికను మెచ్చుకుంటాను; దానికి స్టాండర్డు ఉందని ఒప్పు కుంటాను; ఆ సంపాదకుని తెలివికీ, టేస్టుకీ సంతసిస్తాను.

అందాకా ఎందుకూ? నా రచన ఉన్న పత్రికని పాఠకుడు ఎలా గౌరవిస్తాడో కూడా నాకు తెలుసును. ప్రతి పాఠ కుడూ నా రచనకోసం పత్రిక తిరగవేస్తాడు. నా రచన దగ్గర ఠక్కున ఆగుతాడు—ఎంతో ఆప్యాయంగా ఒకటికి నాలుగుసార్లు నా రచనను చదువుతాడు. తర్వాత పత్రిక విసిరి అవతలపారవేసి 'ఈ పత్రికలో ఫలాని రచనతప్ప మిగతాదంతా చెత్త' అనుకుని, ఐనా డబ్బు దండుగ లేకుండా ఒక్క రచ నైనా మంచిది ఉందని తృప్తి పడతాడు. నా పాఠకుడు తాను తృప్తిపడి ఊరుకోడు. ఆవాళ కనపడ్డవాళ్ల నెల్లా 'ఫలాని పత్రికలో ఫలాని రచన చదివావా?' అని అడుగు

తాడు. వాళ్లు 'లేదంటే 'నీ జన్మ వ్యర్థ'మని శపిస్తాడు. దానివల్ల వచ్చే నష్టాలుకూడా గమనించడు.

అందుకనే, నేను నా పాఠకుల దాహం తీర్చటానికి రాస్తాను, రాయకపోతే నేను వాళ్లకి ద్రోహం చేసినట్టు కాదా?

నేను రాయటానికి కూర్చుంటే 'ఏమి రాయాలి?' అనే చింత నన్నెప్పుడూ బాధించదు. నిజానికి, రాయగల నా బోటి ప్రతిభావంతుడికి విషయాలే కరువా? ఈ క్షణాన ప్రపంచంలో, అంతదూరం పోలేకపోతే - మన చుట్టుపక్కల జరుగుతున్న విషయాలు తీసుకుంటే అనాయాసంగా రెండు మూడు పేజీలు నింపిపార వెయ్యవచ్చు. ఈ ప్రపంచంలో విషయ దారిద్ర్యం లేదు; భావ దారిద్ర్యం తప్ప! చూడండి, మచ్చుతునకలు కొన్ని ఇస్తున్నాను.

**ఫాసిస్టు విజృంభణ :**

తూర్పున జపాను సామ్రాజ్య కాంక్ష అనే ఆవేశానికి లోనై చైనా గుండెలమీద పైశాచిక నృత్యం చేస్తున్నది. చైనా మూలుగుకు, హాహాకారాలకు శాంతిదేవత నిద్రపోవటం లేదు. జపాను ముష్కరతనూ, పైశాచికతనూ చైనా ధైర్యంతో, ఓర్పుతో గత నాలుగు సంవత్సరాలనించీ ఎదు రొడ్డుతున్నది. దానికి సహాయపడటానికిప్పుడు నానాజాతి సమితి లేదు. చైనా శక్తి, చైనా రోదనం నానాటికీ సన్న గిల్లుతున్నది. అసహాయ చైనా సహాయంకోసం ప్రపంచ ప్రజా స్వామ్యాలవేపుకు జాలిగా, దీనంగా, తడికళ్లతో చూస్తున్నది. కాని? నేడవి చైనాకు వలసినంత సహాయం చెయ్యగల స్థితిలో లేవు. చిన్న చిన్న ప్రజాస్వామ్యాలను హిట్లరు

ముసోలినీలనే రాహుకేతువులు ఎప్పుడో మింగివేసినై. ఒక్క బ్రిటనుమాత్రమే మిత్రమండలి సహాయంతో ఈ రాహుకేతువులను ఎదుర్కొంటున్నది. ఫాసిస్టు భూతాన్ని అనేక రంగాల్లో చించి చెండాడుతున్నది. ఈ రాహుకేతువులు సూర్యచంద్రుల్ని ఎక్కువకాలం గ్రసించ లేవు. గ్రహణం ఒకవైపు నించి విడిచి పోతున్నది. అదుగో-అమెరికా! మిత్రమండలికి బాసటగా నిలిచింది. చైనాకూ బ్రిటనుకూ వలసిన సహాయం చేస్తున్నది. ఫాసిస్టు భూతాన్ని రూపుమాపటానికి ఆయుధాలు సప్లయి చేస్తున్నది. ఆహారపదార్థాలు యింటికి తెచ్చి దించుతా నంటున్నది. ధన్యురాలు—అమెరికా!

ఇక మిగిలిన పెద్దరాజ్యం రష్యా—మడికట్టుకు ఎడంగా కూర్చున్నది. అది 'పిల్లలు-రొట్టెముక్క' కథలో కోతిపాత్ర ధరించింది!—తన చేతికి దొరికిన ముక్క చెక్క కొరుక్కుంటూ ఉంది!—ఈ స్థితిలో భారతీయుల కర్తవ్యమేమిటి? ఏళ్లతరబడి సృష్టించిన మానవసభ్యతంతా కళ్లముందు నాశనమైపోవలసిందేనా?—లెండు. నాజీనీడలు భారతదేశంమీర పడకముందే మేల్కొండు. ఫాసిస్టు భూతమును తెగటార్చుడు. గాంధి మహాత్ముని అహింసాసూత్రమున కిది చెంపపెట్టు...

**మన రాజకీయాలు :**

హిందూదేశ స్వాతంత్ర్యానికి అమెరీ అననుకూలత కంటె జిన్నా ప్రాతికూల్యమే ఎక్కువ ఆటంకంగా ఉన్నది. ఈ మాట చాలామందికి ఆశ్చర్యకరంగా ఉండవచ్చు. అందుకనే ఇక్కడ చిన్న కథ చెప్పి దానిలోని సత్యాన్ని బయట పెడతాను:—నలుగురు దొంగలు కలిసి ఒక పేదరాసి పెద్దమ్మ

దగ్గిర కొంత ధనం దాచారు. దాచేటప్పుడు ఫలానివాడు వస్తే యివ్వవద్దని గానీ, ఫలానివాడు వస్తే యిమ్మని గానీ మాటలు జరగలేదు. ముభావంగా వెళ్లిపోయింది. పెద్దమ్మ సత్తెకాలపు మనిషి. ఎప్పుడూ ఎవరి సొమ్ముకూ గార్డియన్ గా గానీ, ట్రస్టీగా గానీ ఉన్నదికాదు. ఈ సంగతి గ్రహించి ఒక దొంగ, నలుగురిలోవాడే, పెద్దమ్మదగ్గిరికి వచ్చి మిగతా వాళ్లు తెమ్మంటున్నారని చెప్పి సొమ్ము తీసుకుపోయాడు. తర్వాత మిగతావాళ్లు వచ్చారు. పెద్దమ్మ చేసిన తెలివి తక్కువ పనికి ఆమెని కోర్టు ఎక్కించారు. ఏదో మర్యాద రామన్న జడ్జీ ఐనాడు కాబట్టి పెద్దమ్మని యుక్తిగా తప్పించాడు.

దీన్నిబట్టి తేలేది ఏమంటే పెద్దమ్మ తెలివితక్కువది కాబట్టే నలుగురు దాచింది ఒకడికిచ్చి కోర్టుకెక్కింది. ఇలాంటి పేచీ రావచ్చునని తెలిస్తే ఆ పెద్దమ్మ కూడా సొత్తు ఒకడికే ఇచ్చేదికాదు. దీన్నిబట్టి చూస్తే అమెరీ ప్రవర్తన ఎంత వరకు సమర్థనీయమో తేలిపోతుంది. ఇక అమెరీ అకాలపు పేద రాసి పెద్దమ్మ కాదని కూడా ఎవ్వరూ చెప్పనక్కర్లేదు. అదీ కాక హిందూ ముస్లిము సమస్య నానాటికీ విషమిస్తున్నది. సత్యాగ్రహం దానికి తోడయింది. బాధ్యత గల నాయకు లంతా జైళ్లలో ఉండటంవల్ల రౌడీలు పెచ్చురేగారు. ఈ రోజున లెఖ్ఖలువేసిచూస్తే సత్యాగ్రహంవల్ల లాభంకన్న నష్టమే ఎక్కువ అని తేలుతున్నది. కాంగ్రెసు మంత్రివర్గాలు కాస్తో కూస్తో కూడబెట్టితే సత్యాగ్రహం దాన్ని ఖర్చుపెట్టింది. అదీగాక వ్యక్తి సత్యాగ్రహం పలుకుబడి కల వ్యక్తులకూ ప్రజలకూ తీరని అపకారం కలిగించింది. రాజాజీలాంటి

నాయకుల ఉపన్యాసంకోసం ప్రజలూ, పత్రికలూ ఎదురు చూస్తున్నవి. ఇప్పటికైనా మించిపోయింది లేదు. పట్టు దల వీడి ప్రతిష్టంభన తొలగించటం మంచిది. ఈ విష యంలో హిందూ పత్రిక చేసిన సూచన అవశ్యం స్వీకరించ తగినది. మబ్బులో నీళ్లు నమ్ముకొని చెరువులో నీళ్లు వదులు కోటం బుద్ధిమంతుల లక్షణంకాదు...

ఆడుదాని అధోగతి:

భారతదేశంలో సగానికిపైగా స్త్రీలున్నారు. వారికి ఏవిధ మైన స్వాతంత్ర్యమూ లేదు. చిలకలవలె పంజరాల్లో బంధింప బడియున్నారు. ఆర్థిక స్వాతంత్ర్య మసలే లేదు (మలబారులో తప్ప.) అంచేతనే బాల్యవివాహాలు విచ్చలవిడిగా జరుగు తున్నై. బాల్య వివాహాలు లేకపోతే బాలవిధవలు అసలే ఉండరు. మన దేశంలో విధవలకు సంతాన్వాత లేదు. అంచేత మన జనాభా కావలసినంత వృద్ధికావటంలేదు. ఈనాడు ఏ దేశానికైనా, నిజమైన సంపద సంతానం. అది గ్రహించే, డిక్టేటర్లు వాళ్లదేశాల్లో సంతానవృద్ధికి అనేక పాట్లు పడు తున్నారు. ఎక్కువ సంతు ఉన్న తల్లులకు బహుమానా లిస్తున్నారు. ఫాసిస్టు దేశాల్లో స్త్రీలు తను కింతమంది సంతానమని చెప్పుకోటానికి గర్వపడతారు. పిల్లికి నాలుగు కూనలైతే నాకిద్దరే పాపలని కొంతమంది కించపడతారు కూడా. దేశంలో ప్రేమ వివాహాలు బొత్తిగా కరువైనై. ఎంతోమంది యువతీ యువకులు సంఘరాక్షసికి బలి ఐ పో తున్నారు. కాని సంఘ పెద్దలు చెవుల్లో దూదిపెట్టు కూర్చు న్నారు. సంఘంకంటే వ్యక్తి గొప్ప అని మన పెద్దలు

గ్రహించాలి. వ్యక్తికంటే హృదయం గొప్పది. హృదయం కంటే ప్రేమ...

కథ:

అంకీ అంకడూ దంపతులు. ఇద్దరూ గువ్వలలాగా కాపురం చేస్తున్నారు. కాని అంకడు అందరి మగవాళ్లలాగానే అప్రయోజకుడు. అంచేత అంకి కూలీనాలీచేసి భర్తనూ పిల్లల్నీ పోషించుకుంటూ వస్తున్నది. అంకి రెక్కలకింద అంకడూ వాళ్ళ సంతానమూ తుపాన్లనుకూడా లెక్కచెయ్య కుండా బతుకుతూ వస్తున్నారు.

కాని క్రూరవిధి వాళ్ల సౌఖ్యం చూడలేకపోయింది. రాగయ్య అనే వేటకాణ్ణి అంకిమీదికి పంపకం చేస్తుంది— క్రూరవిధి! రాగయ్య ఎన్నో ఉచ్చులేశాడు; నూలుతో, పట్టుదారాలతో—అంకి వాలలేదు. రాగయ్య ఆ ఉచ్చుల్లో ధాన్యం చల్లాడు, ధనం చల్లాడు, అంకి పడలేదు; రాగయ్యకు నీతి బోధించింది. నశ్వరదేహంమీద చిన్న ఉపన్యాస మిచ్చింది. 'జీవా మాయా కాయమురా' అనే పాట పాడి ప్రబోధించింది. రాగయ్య చెవి కెక్కలేదు. అంకి మళ్లీ చెప్పిచూస్తుంది, ఈ తోలు తిత్తిమీద మోహం మెందు కంటుంది. తన ఆత్మ నిదివరకే అంకడికి ధారాదత్తం చేశా నంటుంది. రాగయ్య చెవి దూరనివ్వడు. అంకిని బలాత్క రించబోతాడు కీచకుడిలాగా. అంకి అరవదు. సైరంధ్రి లాగా భీముడితో ఫిర్యాదుచెయ్యదు. చప్పున చండికలాగా చేత్తో కొడవలి తీసుకుంటుంది. రాగయ్యను నరికివేస్తుంది. తర్వాత తన్ను... ఈవార్త ఊళ్లో తెలుస్తుంది. అంకిని గ్రామ

దేవత చేస్తారు ప్రజలు. ఆ మహాతల్లికి గుడి కట్టిస్తారు. ఇక అంకడు—అంకి గుడికి వాడే పూజారి. అమ్మవారి కొచ్చే నైవేద్యాలతో వాడూ, పిల్లలూ హాయిగా బతుకుతున్నారు. అంకి ఆదర్శ పతివ్రత. తను చస్తూకూడా భర్తకు జీవనోపాధి చూపించిపోయింది. ఇలాంటి పతివ్రతలు......

కవిత :

ప్రేయసి!
నీవు ప్రాణము నేను కట్టెను,
నీవు తావివి నేను పూవును,
నీవు దాతవు నేను యాచను,
నిష్ఠుర దేవత!
నీవు హరిణము నేను గడ్డిని,
,, హిట్లర్ ,, జర్మని
,, మాగ్నెట్ ,, సూదిని,
దేవి!
నీవు శక్తివి నేను భక్తుడ,

ఇలా పెద్ద దండకం రాసుకుపోగలను. రాసుకుపోగలనేమిటి? ఇదివరకు రాసినవే చాలా ఉన్నై. పత్రిక పాలసీనిబట్టి, సంపాదకుడి టేస్టునిబట్టి—నిజం చెప్పాలిసొస్తే వాళ్ల నాడి పరీక్షచేసి మరీ రాశాను. అవన్నీ ప్రకటిస్తే నేను ఆంధ్ర దేశానికి నియంతని కాగలను. నన్ను ఏ జాతీయనాయకుడూ ఏ సాహిత్య రథికుడుకూడా అడ్డలేడు. ఈ మాట యదార్థం. కాని—?

నే నెంత నిరంకుశుణ్ణి అయినా నాపైన అంకుశం ఉంది.

అది పాఠకుడికి కనపడకపోవచ్చునుగాని నాకు కనపడుతూనే ఉంటుంది. అదే ఎర్రసిరా కలం—ఊహుఁ, కలం కాదు అంకుశం! దాన్ని పట్టిన మావటీడే నన్ను నిద్రలోకూడా పొడుస్తూ ఉంటాడు!

నేను నియంతని కాగలనన్నాను. కాగలనని పైమాటకు అన్నానేగాని నేను నియంతనే. కాని నా పైనికూడా ఇంకో నియంత ఉన్నాడు, మహానియంత! అతని కాలెప్పుడూ కన పడకుండా నానెత్తిమీద ఉంటుంది. దాని వత్తిడి 'ప్రెషర్' నేను భరించలేక పోయినా భరించక తప్పదు. కాని నా కింపులో కూడా తృప్తి ఉంది. నా సోదర రచయితలు—కాదు నియంతలు, అంతా నా బాధ పంచుకుంటూనే ఉన్నారు. నాకు మనశ్శాంతి కలిగిస్తూనే ఉన్నారు. నా కదేతృప్తి. తృప్తిపడక చేసేదీలేదు. దీనికి ప్రతీకారం నేను—ఊహుఁ, మేము చెయ్యలేము.

అందాకా ఎందుకూ? అతని అనుగ్రహం లేనిది, మా గోడప పాఠకులతో కూడా చెప్పుకోలేము. అంచేతనే ఆ మహా నియంత అనుగ్రహంకోసం – మాకు నమ్మకమున్నా లేక పోయినా దేవుణ్ణి ప్రార్థిస్తూ ఉంటాము. ఏమేమో మొక్కు బళ్ళు చెల్లించుకుంటూ ఉంటాం. ఇంత బాధ పడుతున్నప్ప టికీ నేను నియంతనే. కాని నా పైనికూడా ఇంకో నియంత ఉన్నాడు. అతని పేరు బయటపెడితే ఈ వ్యాసం మీకంట పడదు!

అతగాడే నియంతల నియంత!

మహానియంత! —మే, 1941.

# దోమదాడి ★

సంపాదకులకు నమస్కారం,

తమరు దయతో రాసిన ఉత్తరం మా పేషెంటుకు అంద జేశాను. వారు చదువుకుని చాలా చాలా ఆనందించారు. తన జబ్బువివరాలు తమకు వ్రాయమని నన్ను కోరారు. నేను వారిడైరీని ఆధారంచేసుకునీ, నా రిపోర్టులనుబట్టీ ఈ ఉత్తరం వ్రాస్తున్నాను. ఈ ఉత్తరం, చోటుదండుగ అనుకో కుండా ఉంటే, తమ పత్రికలో ప్రకటించమనికూడా కోరు న్నారు. కారణం, అనేకమంది మిత్రులదగ్గరనించి శ్రీవారి ఆరోగ్యం తెలుపవలసిందంటూ ఉత్తరాలొస్తున్నాయి. వాటి అన్నింటికీ జవాబులు రాసే స్థితిలో వారులేరు. పైగా యిప్పుడు తపాలాఖర్చులుకూడా పెరిగినై. ఇవన్నీ ఆలో చించి తమరు మిత్రునికి సహాయ పడగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు,

మిస్ మార్త

Nurse-in-charge

"చక్రపాణి" డైరీనించి.

నవంబరు 15, రాత్రి 10—ఉదయం లేచినప్పుడు బద్ధకంగా వుంది. మలేరియా వచ్చేముందు ఇలావుండటం మామూలు. ఐనా నాకు డిసెంబరులో మలేరియా రావటం మా

(తమ క్షేమసమాచారాలు తెలుపవలసిందని "చక్రపాణి"కి ఉత్తరంరాస్తే పై జవాబు మాకు చేరింది. మామూదిరిగా వారిక్షేమాలు తెలుసుకోవాలనే కుతూలం ఉన్నవారికోసం ఈ ఉత్తరం ప్రకటిస్తున్నాము. సం॥ చి॥)

మూలు. సాయంత్రం హోటల్లో "X" కనపడ్డాడు. "Y" మీాద ఏమేమో ఆక్రోశం వెళ్లబుచ్చాడు! పాపం! తన శరీరమే తను కాటేసుకుంటున్నాడని అతనికి తెలియదు...
అబ్బ! వొళ్లంతా హూనం అయినట్టుంది. నిద్రకూడా...

నవంబరు 16, రాత్రి 8—అనుకున్నంతా అయింది. ఉదయం నాలుగ్గంటలకు మెలకువతోపాటు జ్వరంకూడా వచ్చింది. మళ్ళీ నిద్రపట్టలేదు. జ్వరం కొలిచాను 101° 5. క్వినైన్ వేసుకున్నాను. ఇవ్వాళ హోటలుకు ఆబ్సెంటు. హోటలు వాలా తిట్టుకుని ఉండకుండదా! సాయంత్రంకూడా తిన్నాను క్వినైన్.

నవంబరు 17, రాత్రి 9—జ్వరం తగ్గలేదు. క్వినైన్ తింటూనే వున్నా. ఉదయం 8, "X" వచ్చాడు, నిన్న నేను కన పడకపోతే అతనికి పిచ్చిఎత్తినట్టు ఉన్నదనీ, యిలా ఏమేమో వాగాడు నన్ను చెప్పనివ్వకుండా. నేను నెమ్మదిగా నా జ్వరసంగతి చెప్పి, రానందుకు క్షమాపణ కోరాను. కాని అతను శాంతపడ లేదు. అక్కడి నించి నా నిర్లక్ష్యంమీాద ఉపన్యాసం దంచాడు. క్రిందటి సంవత్సరం మలేరియాతగ్గగానే క్వినైన్ ఆపటం బాగాలేదన్నాడు. అదీ ఒప్పుకున్నాను. ఈ సంవత్సరం మలేరియా రాకపూర్వమే క్వినైన్ తీసుకోవలసిందన్నాడు. పోనీ ఇవన్నీ ఒప్పుకున్నా ఇంతవరకు డాక్టర్ని పిలిపించకపోవటం క్షమార్హంకాదన్నాడు, ఐనా నేను డాక్టర్ని పిలిపించలేదు.

నవంబరు 20, రాత్రి 7 30—గత రెండు నాళ్లనించీ సాయంత్రం 103° జ్వరం ఉంటూనే వుంది ఓపిక లేక పోవటంవల్ల

డ్రైరీకూడా రాయలేదు, గంగులు మహా వేధిస్తున్నాడు. ఘంటసేపు కేకలుపెడితేగాని రాడు. పిల్లలతో ఆడుకో టానికి పోతాడేమో! ఎలాగైనా వీడితో వేగటం కష్టమే.

నవంబరు 21, ఉదయం 12—డాక్టర్ని పిలిపించాను. పూర్తిగా విశ్రాంతికావాలన్నాడు. విశ్రాంతి యెలా దొరుకుతుంది? మందు కాదాయె!....మందు, వేళకి యివ్వటానికీ, కని పెట్టివుంటానికీ తన నర్సునే పంపాడు. రోజుకు రెండున్నర ఆముదం ఏంచేస్తాం? తెచ్చుకోటం సులభంగాని వది లించుకోటం సులభమా? ఎలాగైనా నాలుగురోజులల్లో వదిలించుకోవాలి!

మెడికల్ రిపోర్టులు:

నవంబరు 21, సాయంత్రం—జ్వరం 103°. రోగి చాలా ఢీలా అయినాడు. ఇవ్వాళ రెండుపూటలు మాత్రం క్వైనైన్ యిచ్చాను.

నవంబరు 22, ఉదయం—రోగి రాత్రి కలవరించాడు. భయ పడేట్టుగా అరిచాడు. లేచినతర్వాత అడిగితే చెడుకల వచ్చిందన్నాడు.

సాయంత్రం—డాక్టరుగారు కూడా ధైర్యం చెప్పారు. ఒక రిద్దరు మిత్రులు దర్శనానికి వచ్చారుగాని వీలులేదన్నాను.

23, ఉదయం — మామూలే డాక్టరుగారు మందు మార్చారు. రోగి చేదుగా వుంది తాగనని మొండికి వేశాడు ఐనా తాగ తప్పలేదు.

సాయంత్రం 6—డాక్టరుగారు వచ్చేవరకు గదినిండా దోమలు. ఫ్లిట్‌పంపు కొనమన్నారు. మంచానికి తెరకూడా వెయ్యా

మన్నారు.

24 ఉదయం—రాత్రి మంచానికి తెరవేశాను. ఫ్లిట్‌పంపు తీసుకుని గదిలోకి దోమలురాకుండా చూస్తున్నాను. ఐనా దోమలు వస్తూనే ఉన్నాయి. చాలాభాగం చస్తూనే ఉన్నాయి. డాక్టరుగారువచ్చి చచ్చిన దోమల్ని చూశారు. సంతోషించారు. చిత్రం! ఎలాపోయినవో దోమతెరలో దోమలున్నాయి. డాక్టరుగారు నన్ను ప్రత్యేకంగా హెచ్చరించారు, జాగర్తగా ఉండమని.

25 ఉదయం—రాత్రి అంతా దోమల్ని వేటాడుతూనే ఉన్నాను. తెరలో ప్రవేశించిన దోమల్ని చంపటం అసాధ్యంగా ఉంది. వాటికోసం పోతే యింకా చాలా ప్రవేశిస్తున్నాయి. రోగి అధైర్యపడ్డాడు. స్థానం మార్చటంతప్ప గత్యంతరం కనపడలేదు. కాని రోగి ఒప్పుకోలేదు.

26, 27, 28, 29—పరిస్థితులు మామూలే. చోటు మార్చటానికి రోగి ఒప్పుకున్నాడు.

30 ఉదయం—చోటుమార్చినా దోమదాడి పూర్తిగా తగ్గలేదు. కాని అక్కడికంటే నయం, డాక్టరుగార్ని సెలవివ్వమని అడిగాను. ఆయన మండిపడ్డాడు. నాలో నర్సుకుండవలసిన ఓర్పూ, సైనికుడికుండవలసిన ధైర్యమూ లేదన్నారు. దోమల భయంమూలాన నేను పారిపోతున్నా నన్నారు.

డిసెంబరు 1 ఉదయం—జ్వరం 100. నిన్న సాయంత్రం కూడా తగ్గేవుంది. రోగి కొంచెం ఉత్సాహంగా ఉన్నాడు.

డిసెంబరు-2.3.4.5. జ్వరం ఉదయం 98.6. సాయంత్రం 100.5.

డిసెంబరు 6—రోగి అన్నం తింటానని అడిగాడు డాక్టరు గార్ని. వారు ఒప్పుకున్నారు. అన్నం పెట్టాము.

డిసెంబరు 7, 8—పరిస్థితులు మామూలే. జ్వరం పూర్తిగా పోలేదు. రోగి పత్రిక చదువుకుంటానని కోరాడు. డాక్టరు గారు ఒప్పుకున్నారు.

డిసెంబరు 9, ఉదయం—జ్వరం 103. రోగికంటె నే నెక్కువ గాభరాపడ్డాను. డాక్టరుగారు చాలా ప్రశ్నలు వేశారు. కాని కారణం తెలియలేదు. డాక్టరు నిన్నటి పత్రిక తీసుకుని చదువుతూ హెల్తు రిపోర్టులదగ్గర ఆగారు. మలేరియా వల్ల 1000 కి 378 మరణాలు. రోగి ఎందుకు భయపడడు? జ్వరమెందుకురాదు ?—పత్రిక యివ్వటం మానేశాము.

డిసెంబరు; 10—పగలెల్లా ధైర్యం చెబుతూనే వున్నా రోగికి.

డిసెంబరు 11—రోగికి కొంచెం ధైర్యం చిక్కింది. రాత్రి దోమలు వస్తూనే ఉన్నయి. కాని మాకు మామూలు అయింది. నేను ఫ్లిట్‌పంపు తీసుకోగానే రోగి నవ్వుతూ వుంటాడు.

డిసెంబరు 12. ఉదయం—డాక్టరుగారు వచ్చి జ్వరం చూడ వద్దన్నారు, ఇకనించి.

డిసెంబరు 13, 14, 15—శరీరం కొంచెం వెచ్చగా వుంటున్నా రోగి ధైర్యంగా కులాసాగా వుంటున్నాడు. ముఖం తెల్లగా కాంతిగా వుంటున్నది. డాక్టరుగారు వచ్చి ఇక ఏవిధమైన ఆదుర్దా లేదన్నారు.

—ఆగస్టు 1940.

# కొమ్మ

ఈమధ్య బొమ్మలపిచ్చి ఎక్కువైంది. శ్రీ. శ్రీ.ని చూచి తలా వొకటి కొన్నారు. చాటుగా ఏమేమో మాట్లాడు తున్నామని చెప్పుతున్నారు. నాకు వాళ్ల అనుకరణచూస్తే, కోతులు తలుపుకొచ్చాయి, అసహ్యం వేసింది. కాని, నింపా దిగా ఆలోచించినమీదట నాదే పొరపాటేమో ననిపిం చింది. మన మిప్పుడు ఎంత నాగరికులమని విర్రవీగుతున్నా, అసలు కోతుల్నించేగా మనం వచ్చింది? ఆ స్వభావమెక్క డికి పోతుంది? అథవా పోగొట్టుకున్నందువల్ల మనకొచ్చే గొప్పమాత్ర మేముంది?

ఈ వేదాంతం నన్ను లొంగదీసింది. మనకికూడా ఒక బొమ్మ ఉంటే? — బాగుండునా, ఓగుండునా? ఎన్నో రాత్రిళ్లు ఆలోచించాను. ఆలోచించినకొద్దీ బొమ్మ నామీద ఎక్కి తొక్కింది. తొక్కుతున్నదని కోపించినకొద్దీ, నామీద పవార్లు తోలింది. ఆకోతుని నిగ్రహించే శక్తిలేకనే, నేను బొమ్మల దుకాణానికి దాడుతీశాను. విచిత్రంగా చూశాడు షాపువాడు నావంక. నాకు ముష్టిలేదని చెప్పటానికి సిగ్గు పడేంతగా సిగ్గుపడ్డాడు.

"ఒక్కటన్నా..." అన్నాను సగం చచ్చి.

"అంతా తీసిపారేసిన బొమ్మ వొకటి ఉంటే, ఇప్పుడే ఒక ఆడమనిషివచ్చి తీసుకుపోయింది."

కావా లనుకున్న వస్తువు కావా లన్నప్పు డెప్పుడు

దొరికింది?—నేను బ్రోకెన్ హార్టుతో కాకపోయినా, పెద్దగా డిసపాయింటై బయలుదేరాను. పదడుగులు వేశానో లేదో వెనకనించి—"బొమ్మకోసం తిరుగుతున్నావా?" అన్న కీచు గొంతు వినిపించింది. తిరిగి చూశాను. ఆడమనిషి, పరాయిది, చంకని బుట్టపెట్టుకు నుంచున్నది. మనిషిలో ఆకర్షణ లేక పోలేదు.

"నన్నేనా?" అన్నాను.

"ఆఁ."

ఈమాటు వీణతీగ మీటినట్టుగా ఉంది.

"నీదగ్గరుందా, బొమ్మ?" అన్నాను.

"ఆఁ. కాని, నీకు బొమ్మెందుకు? బొమ్మల్ని ఆడించే కొమ్మ ఉండగా."

"ఎక్కడుందీ?"

"ఎక్కడుంటే నీకెందుకూ? కావాలా?"

"అంతకంటే కావలసిందే ముంది."

"ఐతే, ఆమె షర్తులు నువ్వు వొప్పుకోవాలి." ఏమిషర్తులు పెట్టుతుంది? మహాపెట్టితే, గంగలాగా పిల్లల్ని తనస్వాధీనం చెయ్యమనో, యోజనగంధిలాగా తన పిల్లల్ని వారసుల్ని చెయ్యమనో అడుగుతుం దనుకున్నాను—అంతకంటే, పట్టాభి షేకం చెయ్యటానికి మనకి రాజ్యాలేమి ఏడిచాయి!

"చెప్పుముందు," అన్నాను.

"ఆమెనిగురించిన వివరాలేవీ అడగకూడదు."

"ఇంతేనా?"

"ఇంకా ఉన్నై. ఆమె స్వేచ్ఛకి అడ్డురాకూడదు."

"నా దేం పోయిందీ, అడ్డురావటానికి ?"

"ఆమెవస్తువు లేపి తాకకూడదు."

"నా కేం పట్టింది ?"

"ఐతే యిక వెళ్దాము పద."

బండి మాట్లాడి ఎక్కించాను. కాని, నాలో 'ఈమె ఎవ్వ' రనే జిజ్ఞాస చావలేదు—శంతనుడిలాగా ఆమె షర్తులన్నీ కళ్లు మూసుకుని వొప్పుకున్నప్పటికీ ? ఆమెగాలి సోకినప్పటినించీ నాకు 'అతితెలివి' పుట్టుకొచ్చింది.

"ఒక్క-మాట—" ఆపైన అడగటానికి ధైర్యం చాలలేదు.

"ఫర్వాలేదు, అడగండి."

"అడక్కూ-డదు గాని, మీ ప్రాయం..."

"నాకు ప్రాయ మేమిటి ? నాది చిరయౌవనం."

ఇకేమీ అడగలేదు. బండి యింటిముందాగింది.

శ్రీ. శ్రీ. బొమ్మని తెచ్చుకుంటే, మిత్రులు తగ్గిపోయారు. నేను కొమ్మని తెచ్చుకుంటే ఎక్కు-వయ్యారు. శాస్త్రి, శర్మ, నాయుడు, వర్మ; దానియేలు, రామదాసూ— ఒకరేమిటి అంతా. చా ఖర్చూ, సిగరెట్ల ఖర్చూ ఎక్కు-వైంది. నా డబ్బుతో నా కొమ్మతో సరసాలాడిపోతూ ఉండేవాళ్లు అంతా. కొమ్మకి కొత్తాపాతా లేదు. ఎంత చొరవచేసుకో గలిగితే, అంత చొరవగా ఉంటుంది.

మొదటిరోజు ఆమె నాకు బ్రహ్మానంద మిచ్చింది. రెండో నాడు ఆమెలోప మేమీ లేదుగాని, నాలో మార్పువొచ్చింది. తగిన రస మనుభవించలేకపోయాను. మూడోనాడు మిత్రులెవ్వరూ లేనిసమయం చూసి, నా అసూయని సలహా

రూపంలో బయటపెట్టాను. ఆమె శాంతంగా విని, నవ్వుతూ—
"నేను పతివ్రత ననుకుంటున్నావా ? లక్షలమందిదగ్గర ఉండి
వచ్చా," నంది.

నాకు వొల్లు ఝల్లుమంది. లక్షలమంది దగ్గరా !

"ఐనా, యింకెంతకాల మిలా స్థిమితంలేకుండా తిరుగు
తావు?" అన్నాను ఆమెమీద జాలి చూపుతూ.

"నాకు నచ్చినవాళ్లు దొరుకుతున్నంతకాలం."

ఏమిటీ మనిషి తత్వం? రెండున్నరదినంలోకూడా ఆమెని
గురించి పిసంకూడా తెలుసుకోలేకపోయానే !

సాయంత్రం వర్మ వచ్చాడు. లొడ లొడ ఏమేమో
వాగాడు. కొమ్మ నాకంటె, అతనివైపుకే మొగ్గినట్టుగా కన
పడింది. కాసేపుడుండి, శర్మ సినిమాకి వెళ్లాలంటూ లేచాడు.
కొమ్మకూడా లేచింది, నేనూ వస్తానంటూ. నన్నెవ్వరూ
పిలవలేదు. నేనూ అభిమానంతో లేవలేదు.

మనిషి నింట్లో ఉండిపోయానేకాని, మనసు సినిమాహాలు
చుట్టూ తిరిగింది. ఆమె, కావాలనే నన్నీవిధంగా అవమా
నించినట్టుగా తోచింది. అలాంటప్పుడు ఆమె కిచ్చిన మాట
మాత్రం నే నెందుకు చెల్లించాలి ? నా వివేకం నన్ను సమ
ర్థించింది. బుట్ట తెరిచి చూస్తే ?..."

తెరిచాను. దాన్నిండా బొమ్మలు, రకరకాలు! చైనావి,
జపానువి. తెల్లవి, నల్లవి, ఆడవి, మగవి! చెయ్యిపెట్టాను,
బయటికి తీసి చూద్దామని. చిత్రం! చేతికి అడుగు తగిలింది.
బుట్ట అంతా గాలించాను, ఒకటి బొమ్మమాత్రం దొరికింది.
తీసిచూశాను, అందంగాఉంది. ఇదేకామాలు మొన్న బొమ్మల

షాపులో కొమ్మ కొనుక్కొని వచ్చింది! మరి వాడు 'అంతా తీసివేసిన బొమ్మ' అన్నాడేం, ఇంత అందంగా ఉంటే? వాడికి ఈస్థటిక్ సెన్సు ఎక్కడిది, నిజానికి? చూశాను, చూశాను — నన్ను అద్దంలో ఎంతసేపు చూసుకుంటానో అంతసేపూ........

అడుగులచప్పుడు వినపడింది. బొమ్మ బుట్టలో వేసి, పక్క మీదకి వచ్చి కూర్చున్నాను. కొమ్మ శర్మని వెంటేసు కొచ్చింది! మరి వర్మ నేమిచేసింది?

"కూర్చోవోయి" అన్నాను శర్మని.

"పొద్దు పోయింది, వెళ్లిపోవా" లన్నాడు అతను. కొమ్మ బుట్ట చంకని పెట్టుకుంది.

"నువెక్కడికి?" అన్నాను నేను.

"శర్మగారివెంట పోతాను, ఆయన నీలాంటివాడు కాదు, రసికుడు."

"నాతప్పు?"

"నువ్వు చేసిన వాగ్దానాలు మూడూ మీరావు."

లెక్కచూసుకున్నాను. ఒకటీ, రెండూ, ఇప్పుడు చేసిన దానితో సరిపోయినై.

"పోనీ, ఈరాత్రికి ఉండిపోకూడదా? మూడునిద్రలూ—"

"ఒక్కక్షణంకూడా ఉండను."

"ఐతే, ఒక్కరహస్యం చెప్పిపో, నీబుట్టలో దేమిటి?"

"చూశావుగా?"

"నాకంతు పట్టలేదు."

కొమ్మ బుట్ట దించి, మూతతీసి, ఒక బొమ్మని బయట

పెట్టింది. బొమ్మ అసహ్యంగాఉంది, గడ్డమూ, జటలూ, గోచీ....

"ఎందు కీ సన్యాసిబొమ్మ ?" అన్నాను.

"ఈయనే వాల్మీకి" అని ఇంకో గడ్డపు బొమ్మనితీసి "-వ్యాసుడు" అంది.

"ఓహో, ఈమె మహాకవులందర్నీ బుట్టలో వేసుకుంటూ తిరుగుతున్నదే, అనుకుని "కాళిదాసు ఉన్నాడా?" అన్నాను. గడ్డంలేని బొమ్మనుతీసి టేబిలుమీద పెట్టింది. కాళిదాసుకి గడ్డంలేదు! గడ్డం లేకుండానే అంత గొప్పవాడయ్యాడు! "మరి రవీంద్రుడో?" అన్నాను. బొమ్మని బయటపెట్టింది.

"సరే వాళ్ళు మాకెందుకుగాని తెలుగువాళ్ళని బయటికి తియ్యి" అన్నాను.

"ఇదుగో తిక్కన్న, పోతన్న, వేమన్న, పెద్దన్న—"ఒక్కొక్కటే తీసి, బయటపెట్టుతుంది.

"చాలు యిక ఈ అన్నలు, ఈ కాలపువాళ్ళలో ఎవరన్నాడుంటే బయటపెట్టు" మన్నాను.

ఒక్కొక్కళ్లనే తీసి బయటపెట్టింది. ఆశ్చర్యం! ఇప్పుడు గొప్పవాళ్ల కింద చెలామణీ అవుతున్నవాళ్ళు, తమతమ శాఖల్లో సింహాసనాలు ఎక్కి కూర్చున్నవాళ్లు చాలామంది లేరందులో!

"ఏమిటి, అంతా వీళ్లేనా?" అన్నాను.

"ఆc."

"ఐతే నీ టేస్టేమీ బాగోలేదు," అన్నాను నేను.

"పిచ్చివాడా నాకేమిటోయ్ టేస్టు, మీకుగాని ?"

"టేస్టుకాక, మరేమిటి? అనామకులికి చోటిస్తివి,

అతిరథుల్ని లాగి పారవేస్తివి ?'' అన్నాను నేను.

''నీతో నాకు వాదన అనవసరం. నాదగ్గరున్న వివి'' అని కొమ్మబొమ్మలు బుట్టలో వేసి, బుట్ట చంకకు తీసుకుని శర్మ చెయ్యిపట్టుకు బయలుదేరింది. ఎందుకనో ఆతీసిన బొమ్మల్లో నాబొమ్మ లేదు. ఆమె ఉన్నంతసేపూ కోరిక చంపుకున్నాను గాని, బయలుదేరగానే ఆగలేక పోయాను.

''ఇదుగో, ఇంకొక్కమాట. నా బొమ్మకూడా ఉందా నీదగ్గర ?'' అని కేకవేశాను.

వాకిటిదాకా పోయిన కొమ్మ తిరిగిచూసి—''నాదగ్గరెందు కుంటుందీ, నీబొమ్మ ? నీదగ్గరే ఉంటుంది! చూసుకో'' అని వెళ్ళిపోయింది.

నాదగ్గరుందా ? జేబు తడిమిచూశాను. చేతికి తగిలిం దేదో! బయటికి తీసిచూశాను—నాబొమ్మే !

అమ్మయ్య! బతికిపోయాను. వెధవకొమ్మ పోతేపోయింది, గాని నాబొమ్మ నాకు దక్కింది. నా కదే చాలు !

# అసంపూర్తి రచన

**రా**వు బహద్దరు మేడ. చుట్టూ తోట. తోటమాలి వెంకన్న చెట్లకు పాదులుతవ్వుతూ ఉంటాడు, కారు డ్రైవరు రహీమ్ మెట్లదగ్గర స్తంభానికి ఆనుకుని కునికిపాట్లు పడుతూవుంటాడు. జోరీగ ఒకటి తోటమాలి కాలిమీద వాలుతుంది. అతను దాన్ని చేత్తో సతువకొద్దీ చరుస్తాడు. అది ఎగిరివచ్చి రహీమ్ ముక్కుమీద వాలుతుంది. మేడపైన పిస్తోళ్ళు కాలుస్తున్న చప్పుడు. రహీముకు మెలకువ రాదు; ఈగనుమాత్రం తోలుకుంటాడు. వెంకన్న విన్నట్టు నటించడు.

పిస్తోళ్ళు కాల్చే చప్పుడు ఆగిపోతుంది. రావుబహద్దరు (55 ఏళ్ళు) గిరి (25 ఏళ్ళు) ఒకరు సోఫాచాటునుంచీ, ఒకరు కుర్చీచాటునుంచీ లేచి పిస్తోళ్ళు ముందుకు చూపిస్తూ ఒక్కొక్క అడుగే ముందుకువచ్చి కలుసుకుంటారు. రావుబహద్దరు చేతిలో తోలుసంచి, చేతిని వెనక్కు పెట్టుకుంటాడు.

గిరి—ఆ సంచి యిలా తే.

రావు—నా ప్రాణాలు పోయినా యివ్వను.

గిరి—పిచ్చివాడా! అదేమంత ఘనకార్యమని చావును కోరి వరిస్తావు. ఆత్మహత్య మహాపాతక మంటారే నీబోటి పెద్దలు! బతకటానికి వీలుండికూడా నాచేతిలో చావడం ఆత్మ హత్య చేసుకోవటం కాదా? (జవాబుచెప్పు అన్నట్టుగా చూస్తాడు.)

రావు—దిక్కులేనివాణ్ని దగ్గరకుతీసి పెంచినందు కిదేగా నీవుచేసే పని? ఇంకా నయం, నేను చిత్ర గొంతు తెగ్గొయ్య లేదు! అది నిన్నిక జన్మలో చేసుకోదు.

గిరి—చిత్రా! ఎవడికావాలి, ఆ చట్టి ముక్కుది? నాకావలసింది (జేబులోనించి రూపాయితీసి మోగించి) డబ్బు!

పాట—ఈడబ్బే ముఖ్యము ఇలలో
నీకూ నాకూ చిత్రకు వెంకికి అందరికిదియే సూత్రం
ఏల పడెదెవిపుడాత్రం, నలిగిపోవు నీదు గాత్రం, వేగమె తెమ్మిటు పత్రం.
రావు—నేనివ్వను రా నీకు పత్రం, నువ్వు చచ్చిన తలవను గోత్రం,
నిను పెంచినందుకిది తంత్రం,
నిను వంచుటకిదియే (పిస్తోలు చూపుతూ) మంత్రం
గిరి—అయితే చావు ముసలిపీనుగా!

(రావుబహద్దరు గొంతుపట్టుకుంటాడు. వృద్ధుడు కీచుమని అరిచి చేతిలో సంచి విసిరివేస్తాడు. సంచి రహీము నెత్తిమీద పడుతుంది. రహీము మేలుకుని "యా అల్లా" అని కేక వేస్తాడు. వెంకన్న రహీమువేపుకు తిరుగుతాడు. రహీము సంచి చేత్తో తీసుకుంటాడు.)

(స్వగతం) పాట—దొరికెగా, ఈ సంచి నాకూ దొరికెగా,
నా యదృష్టమిది, నా నసీబు యిది, అల్లా రాముడు ఏకమైరిగా,
కాచుకొనుడు మీరిక ధనవంతులు కాలమహత్మ్యముగా!

వారే, నసీబ్! ఎన్నాళ్లకు తిరిగావు? ఎవ్వరూ చూడటం కూడా లేదు. పారిపోతాను.

(రెండడుగులు వేస్తాడు, వెంకన్న కేక వేస్తాడు.)

ఈ ముండాకొడుకు చూడనే చూశాడు. అందకుండా పారిపోవాలి.

(పరుగెత్త నారంభిస్తాడు, తోటమాలి కేకలువేస్తూ వెంటపడతాడు.)

* * *

ఒక్క గజం ఎడంగా రెండు తాడిచెట్లు. యానాది పోలి ఒక చెట్టును అనుకుని రెండో చెట్టును తన్ని పెట్టి పాడుకుంటూ ఉంటుంది (వయస్సు ఇరవైఏళ్లు) కాలిమీద కూతురు వరాలు. (మూడోఏడు)

పాట: ఈ విరహవ్యథా నేనెటులా సహింపనోతునే చెలియా, సఖియా, కలికీ, కొలికీ.
కట్టడి భటులూ పట్టుకుపోయిరి నాథుని చేతులు విరిచీ,
ఎక్కడి న్యాయం? ముంత ధాన్యము దొంగతనమాయె!

(పిల్ల ఏడుస్తుంది.) ఊరుకోవేగుంటా! నీపోరు ఎక్కువైంది, బయటి పోరే పడలేకుండా వుంటే.

(రహీము పక్కగా పరిగెత్తుకు వెళ్ళాడు. వెంకన్న దగ్గరకు వచ్చేవరకు పోలి అడ్డు వస్తుంది.)

పోలి—ఎందుకు వెంకయ్య మామా, అలా వెంటపడ తావు ?

వెంకన్న—సంచి ఎత్తుకు పారిపోతున్నాడు.

పోలి—పోతే పోలీసాళ్లు వుంటారులే నీకెందుకీ యాతన ? ...నోటిలోకి కాస్త పుగాకు పెట్టు మామా.

వెంకన్న—ఎక్కడిదే పిల్లా! ఒళ్ళో దాచుకు కూచున్నా నటే !

పోలి—ఉందిలే మామా! (కుచ్చెళ్లు పట్టుకుంటుంది)

వెంకన్న—ఇస్, వదలవే, పెడతాను. (రొండినుంచి తీసి పొగాకు పెడతాడు) ఆ యదవ తప్పించుకున్నట్టేనా?

పోలి—ఎక్కడ మామా! నిన్ననేగా పోలీసోళ్లు పట్టుకు పోయింది. ఈ తాప పెద్ద సిచ్చ పడతదట.

వెంకన్న—ఎవరికే సిచ్చ ?

పోలి—మీా తమ్ముడు ఉద్దండిగాడికి, మామా. ఇక నా బతుకెట్టా ? (ఏడుస్తుంది)

వెంకన్న—పిచ్చిదానా, ఎందుకేడుస్తావు ? మేములేమటే ! సరేగాని ఎందుకు పట్టుకెళ్ళారు ?

(పోలి, నిన్న పోలీసులువచ్చి ఇల్లు సోదాచూడటం. నేలా, కప్పూ తిరగ దియ్యటం. రెండు వెండి ఉగ్గు గిన్నెలు దొరకటం. అవి దొంగ సొత్తని ఉద్దండిగాడిని పట్టుకెళ్లటం చెప్పుతుంది.)

పోలి—నిజం మామా! అవి కాకులు పడేస్తే గుడిసెలో దాచాను. కాని మామాట ఎవ రాలకిత్తారు ?

వెంకన్న—పిచ్చిదానా! ఇవి న్యాయానికి రోజులటే ? ధైర్యంగావుండు. మన రోజులు రాబోతున్నయి.

పోలి—మామా! అప్పుడప్పుడు నాగతి కనుకుంటూ వుండు.

(వెంకన్న పోలీ చెరోవైపుకు వెళ్ళిపోతారు.)

*　　　*　　　*

హేమ (వేశ్య, ప్రాయం 25 ఏళ్ళు) ఇంట్లో. గిరి పక్కమీద పండుకుని ఉంటాడు. హేమ కాళ్ళదగ్గర కూచుని ఉంటుంది.

హేమ—అయితే మీ మామ అంతా చిత్రగేఖకే రాసిపోయాడా ? మీకేమీ లేనట్టేనా ?

గిరి—చూస్తా చూస్తా ఆ పిసినిగొట్టు ఇస్తాడుగా! ముండాకొడుక్కి తగిన శాస్తి జరిగింది.

హేమ—పాపం ! ఏమంత కష్టమొచ్చి చచ్చిపోయాడూ ?

గిరి—వాడు చావకేం? నేనే గొంతు పిసికి చంపాను.

హేమ—ఎందుకూ ?

గిరి—నీకోసమే.

హేమ—గిరీ, నువ్వు నన్ను తప్పర్థం చేసుకున్నావు. నిన్ను ఎంత ప్రేమిస్తున్నానో ఈ హృదయం చీల్చి చూస్తే తెలుస్తుంది. స్త్రీ చెడిపోవడం కేవలం పొట్టకోసం. చాటుగా శరీరాన్ని అమ్ముకునేకంటే, ఆ డబ్బుకోసం నిన్నే బలవంత పెట్టడం మంచిదని ఎంచాను. ఈ నగలూ నాణ్యాలూ నా

కోసం కాదు; నీకోసమే, నిన్నాకర్షించటానికే. నీకొరకేదైనా చేస్తాను...సరేగాని, హత్యచేశావని రేఖకు తెలియదూ?

గిరి—తెలుసు, పోలీసులకు లంచాలు పారేసింది రేఖేగా.

హేమ—గిరీ, మన యిద్దరిదీ పూర్వజన్మ సంబంధం.

గిరి—ముందు జన్మలోకూడా మన సంబంధం ఇలానే ఉంటుంది. మనిద్దరమూ కలిసినరోజు జ్ఞాపకమున్నదా?

హేమ—ఎందుకులేదు? కళ్ళకు కట్టినట్టుగా ఉన్నది.

(హేమ వెనకటి సంగతి జ్ఞాపకం చేసుకుంటుంది. ప్రాణ సారధి దివాళా ఎత్తటమూ. తనకు డబ్బివ్వటం అలావుంచి, తన వస్తువులే ఎత్తుకెళ్లి అమ్ముకుంటూవుండడమూ. ఒక రోజున మెడలోని హారం తెంచుతూవుండగా తను కేక వెయ్యటమూ, గిరి దేవుడల్లే వచ్చి అడ్డుపడటమూ, గిరినిచూడగానే ప్రాణ సారధి పారిపోవటమూ, తను చూపిన కృతజ్ఞతా. రాత్రికి ఉండిపొమ్మని గిరిని ప్రాధేయపడడమూ)

హేమ—ఎంత చిత్రం!

*　　　*　　　*

పోలి చుట్టుగుడిసెదగ్గరకు వస్తుంది. గుడిసె తడికె తీసివుంటుంది. కుక్క లేవో నెట్టుకుపోయినవని లోపలకుపోతుంది. నేలమీద పరిచిన చాప మూలకుపోయి ఉంటుంది.

పోలి—ఎంత చిత్రం, (మూలకుపోయి చాప పట్టుకుంటుంది. అందులోంచి రహీము బయటపడతాడు) ఎవరు నువ్వు? మూలను కూచుని ఏమిచేస్తున్నావు?

రహీమ్—ఏమిచేస్తాను. అల్లాను తలుచుకొంటున్నాను.

పోలి—నీ పరాచికం చాలించి నిజం చెప్పు. ఇక్కడికెందు కొచ్చావు?

రహీం—తలదాచుకోటానికి.

పోలి—నీ దగ్గిర చానా పలుకుందే! ఇప్పుడు పోలీసుల్ని పిలిస్తే నీ గతేమౌతుంది?

రహీమ్—ఏమౌతుంది? ఉంటానికి కొంప, తింటానికి కూడూ దొరుకుతుంది.

పోలి—(కొంచెం ఆలోచించి) మరి మాబోటివాళ్ళకి ?

రహీమ్—నీకెవరూ సంపాయించి పెట్టేవాళ్ళు లేరా?

పోలి—నిన్ననే మా మామను పోలీసులు పట్టుకెళ్ళారు. (కంట నీరు పెడుతుంది)

రహీమ్—ఎందుకూ దుఖ్ఖం, నేను కాపాడతాను నిన్ను. (వాకిట్లో పిల్ల తొంగి చూస్తుంది) ఎవరూ? మనమ్మాయేనా?

పోలి—(సిగ్గుపడుతూ) ఆఁ...వరాలూ, ఇలారా తల్లీ, (పిల్లను చంకకు తీసుకుని) ఈ మనిషి ఎవరో చెప్పూ?

వరాలు—బాబాయి.

రహీమ్—ఇంకేం, అప్పుడే గుర్తుపట్టింది. పూర్వజన్మ సంబంధమంటే ఇదే. ఇలారా వరాలమ్మా. (చేతులు చాపుతాడు, పోలి మందహాసంచేస్తూ పిల్లను చేతికిస్తుంది)

* * *

(రావుబహాద్దరు మేడ. గిరీ, చిత్రరేఖా ఒకరికెదురుగా ఒకరు నుంచుని వుంటారు. చిత్రరేఖ నోట్ల కట్ట గిరిచేతిలో పెడుతుంది.)

గిరి—ఎన్ని ?

చిత్ర—ఐదువందలు. (గిరి మళ్ళీ నోట్లు తిరిగిస్తాడు) గిరీ, నా మాటవిని తీసుకో. నాన్న చచ్చి నెలకూడా కాలేదు. ఎంత ఖర్చయిందో తెలుసునా?

గిరి—నా కవన్నీ తెలియవు, ముందు ఐదువేలూ చేతులో పొయ్.

చిత్ర—నామాట వినవూ, మా గిరి మంచివాడు (దగ్గరకు వచ్చి భుజంమీద చెయ్యివేస్తుంది. గిరి చేతిని గొంగళీ పురుగును తీసివేసినట్లు తీసివేసి)

గిరి—నన్ను మైమరుపుచ్చాలనే? పసివాడిననుకున్నావా, ఏమిటి? ముందు పైసా రానివ్వు.

చిత్ర—గిరీ, నాన్న చెప్పినట్లు చేయవూ?

గిరి—చస్, నాకు పెళ్ళివద్దు, నాక్కావలసిందల్లా డబ్బే, ఊఁ, తే—

చిత్ర—హా భారతమాతా, ద్రౌపతీ సత్యభామా వగైరాలు పుట్టిన నీ భూమిలో స్త్రీలెంత అధోగతిలో ఉన్నారు! ఇక దిక్కెవ్వరు? మొక్కెవ్వరూ? కంచే చేనుమేస్తే కావలి యెవ్వరూ? (ముక్కులు ఎగరవేస్తుంది.)

గిరి—అదిగో మళ్ళీ మొదటికొచ్చావు, ఆ చెప్పు లిలా పారేసి, నీ ఇష్టమొచ్చినంతసేపు ఉపన్యాసం దంచు.

చిత్ర—గిరీ, నీ పేరుకు తగినట్టుగానే నీది రాతిగుండె, అబల నిలా బలాత్కరించటం న్యాయమేనా?

గిరి—చిత్రా, నీ మాటలు చిత్రంగా లేవా? వివాహం చేసుకోమని నువ్వు నన్ను—

చిత్ర—ఇక చాలించు గిరీ, డబ్బు తెచ్చిస్తాను, (పోయి ఇనప పెట్టె తెరుస్తుంది. బిచ్చగాడు తత్వం పాడుకుంటూ పోతాడు.)

చేపకోసమూ ఎరపెట్టారూ, ఎరతిని చేపా యెళిపోయిందీ,
అడవి జంతువుకు ఎంతమేపినా మచ్చిక అవునా మాటలు వినునా?

వెర్రిజీవమా, పిచ్చను పడితివి అక్షులు తెరువుము వేగా.
అతకని దానికై టంకము ఖర్చూ, వృథా వృథా వృథ తెలుసుకోలేవా

*  *  *

(రహీము వరాలును చంకనెత్తుకుని పాడుకుంటూ ఉంటాడు—పోలి ఇంటిముందర)

మదీనా మురేఖ మేరే మౌలాబులాలే.
నిష్కర్మమార్గము చాల గొప్పది, కన్నుదెరచీ చూచితే.
కాయకష్టము చేయకూడదు. కూలి డబ్బులకోసమూ.
నీరు. గాలికి మల్లెసంపద అందరికి చెందాలిగా.
అమ్మా ! చెప్పవే వరాలా ! నిజంగాదటే ?—మేరే....
మాయమతములు వచ్చి మనుజుల నాశనము చేశాయిగా.
హెచ్చు తగ్గూ లనెడికృత్రిమభేదములు పెట్టాయిగా,
ఆదిలోనూ అంతమందున అందరేకము అవెదరూ,
మూడురోజుల ముచ్చటకు ఈ తారతమ్యము లేలనూ ? (పోలి వస్తుంది)
ఏమే. పోలమ్మా చెప్పవే ! నిజం కాదటే ?—మేరే....

పోలి—ఏం సాయిబయ్యా! కూటిగింజ లే మనుకున్నా, యేదాంతంలో పడ్డావు ?

రహీమ్—ఏం ? నేనిచ్చిన డబ్బంతా ఖర్చయిందా ?-

పోలి—అది ఖర్చెట్టడం మొదలెడితే ఎన్నాళ్లొత్తది ?

రహీమ్—(పిల్లను చేతికిచ్చి, పోలి బుగ్గమీద చిటికె వేసి) వెధవ డబ్బు! చిటికెలో సంపాదిస్తాను. అదేమంతా ఘనకార్యం.

*  *  *

(చిత్రగది. చిత్రా, పార్థసారథి)

పార్థసారథి—అదేమంత ఘనకార్యం! నా అనుచరులొక్క క్షణంలో చేస్తారు.

చిత్ర—ప్రాణానికి ముప్పు ముండకూడదు. కాలు తొలగదీస్తే చాలు.

పార్థసారధి—అలాగే, అలాగే. మీకు లోంగేటట్టుగా చేస్తానుగా!

చిత్ర—జాగ్రత్త! ఇందులో నేనున్నానని తెలియకూడదు.

పార్థసారధి—దేముడికి తెలియనిస్తానా?

చిత్ర—(మందహాసంచేసి) మీరు అఖండులు!

*  *  *

(హేమకు కలవస్తుంది. గిరి తన యింట్లోనుంచి పోతూవుంటే పార్థసారధి నాయకత్వం క్రింద అయిదారుగురు వ్యక్తులు వెనకాలగావచ్చి పైనపడి కొట్టినట్టూ, కాళ్ళు విరగదీసినట్టూ. హేమ తుళ్ళిపడిలేచి నిద్రపోయే దాసీని జుట్టుపట్టుకులేపి చేతులుపట్టుకుని ఊగుతూ పాడుతుంది.)

పోయినాడే ప్రియుడు పోయినాడే!
ఇక చిక్కడమ్మా, నాకు దక్కడమ్మ!
పాడునిద్రా నాకు ముంచుకొచ్చెనే,

(చేతులువదిలి గోడమీది సీనరీపటం దగ్గరకువెళ్ళి)

చెట్టులారా; ఓ పుట్టలారా! చూచినారా ప్రియుని చూచినారా?

(అక్కడనుంచి ఒక్కగంతు కృష్ణవిగ్రహం దగ్గరకువేసి, యిక్కడ గాంధి విగ్రహం వుంటే యింకా బాగుంటుంది.)

చెప్పవంటోయ్ జాద జెప్పవంటోయ్!
(గద్దిస్తూ వచనంలో) చెప్పవూ, జాదచెప్పవూ?

(అక్కడనుంచి మహారథులంతా అభిమన్యుణ్ని చుట్టివున్న పటందగ్గరకు వెళ్లి—ఇక్కడ సుభాస్‌బాబును వర్కింగుకమిటీ సభ్యులు చుట్టివున్నట్టుగా పెట్టితే కాలానుగుణ్యంగా వుంటుంది.)

ఇంతపాపమా, మీది యింతఘోరమా?

(దాసీవైపుకు చూసి) నే చూడలేనే, వచ్చిపట్టుకోవే!
(వెనక్కు వొరుగుతుంది. దాసివచ్చి పడకుండా పట్టుకుంటుంది)

*  *  *

(పార్థసారధీ, చిత్రా. చిత్ర మేడమీద సోఫాలో కూర్చునివుంటారు)

చిత్ర—నేనిక వినలేను! అబ్బ! (వెనక్కు ఒరుగుతుంది. పార్థసారధి సోఫాకూ వీపుకూ మధ్య చెయ్యి పెడతాడు. ముఖంలో యే భావమూ కనిపించదు, మూర్ఛ పోయినట్టుగా కనపడుతుంది. పార్థసారధి చిత్రను సోఫాలో పడుకోబెట్టి నీళ్లకోసం వెతుకుతాడు, నీళ్లగ్లాసు యితని కోసమన్నట్టు టేబిలుమీద వుంటుంది. నీళ్ళు తెచ్చి చిత్ర ముఖంమీద చిలకరిస్తాడు. చిత్ర నెమ్మదిగా కళ్లు తెరిచి నిట్టూరుస్తుంది.)

పార్థసారధి—నేను దగ్గరుంటే యిలాజరగనిచ్చేవాణ్ణికాను.

చిత్ర—ఇప్పుడెక్కడున్నారు? (మెరుపు కాంతి లోపలకు వస్తుంది.)

పార్థసారధి—ఆస్పత్రిలో. (ఉరుములూ, మెరుపులూ)

చిత్ర—నేను చూసివస్తాను. (గాలికి తలుపులు కొట్టుకుంటవి.)

పార్థసారధి—నీ వొంటిలోకూడా సరిగాలేదు. ఈ గాలి వానలో యెలా వెళ్తావు?

చిత్ర—నా ఊతవృక్షం, నా ఆరాధ్యదైవం, నా సర్వస్వం పోతూవుంటే నేనిక్కడుండ గలనా? సావిత్రి యముడితో పోట్లాడి భర్తను తెచ్చుకోలేదా? సీత అగ్ని పరీక్షకు ఆగలేదా? ఇంకా యిప్పటి సినిమాల్లోనూ, కథల్లోనూ పతివ్రతలు యెంతేసి పనులు చేయటం లేదు? పవిత్ర ప్రేమకు యివన్నీ లెక్కా? (నౌకరును పిలుస్తూ) కాసీం! గుర్రపు బగ్గీకట్టు! రహీం పోయిన నాటినుంచీ కారు బయటకే తీయటంలేదు. (బండి రాగానే యెక్కికూర్చుని) పార్థసారధీ, సెలవు! నేనే గనక భారతరమణినైతే, మళ్ళీ తప్పకకలుసుకుంటాము!

(బండి సాగుతుంది. కాని కొంతదూరంపోయేవరకు టాపు గాలికి లేచి పోతుంది. పిడుగుపడ్డ చప్పుడు. చిత్ర బండిదిగి చెట్టుకిందికి పోతుంది. గుర్రం బండివాడిని లెక్కచెయ్యకుండా గాలివాలున పరుగెత్తుతుంది)

(పోలి గుడిసె, పిడుగుపడ్డ చప్పుడుకు రహీము లేచి కూర్చుంటాడు.) పోలి రహీము వెళ్ళితేగాని నేను లేవనన్నట్లు పండుకుని వుంటుంది. ఉయ్యాలలో వరాలు. దూరానపాట)

సమయము దొరికెను, తరుణము మంచిది, తొందరపడవే ఓ మనసా ।
తల్లిదండ్రులని, భార్యబిడ్డలని యేల నీకు యీమమత ?
ఎవరి కర్మముకు వారే బాధ్యులు, ఒకరికొకరు కాదు ।
దిక్కులుచూడక స్థిరచిత్తముతో కార్యరంగమున కురుకు.

(పాట క్రమంగా దగ్గరకువచ్చి దూరమయిపోయింది).

రహీం—నిజమాలోచిస్తే ఈ పోలికి నేనెవరు ? నాకు యిది ఎవతె ? ఈ ప్రపంచం మాయ ! (లేచి ఉయ్యాలదగ్గరికి పోయి) మా యిద్దరికీ మధ్యవున్న యీ బంధాన్ని యెలా తెంచుకో గలను ? (పిల్లను ముద్దుపెట్టుకుని) నా వరాలు! నీ పెదిమెలు ఎలా మర్చిపోయేదే! అయినా ప్రపంచంలో గొప్ప వాణ్ణి కావాలంటే బుద్ధుడుమాదిరిగా సంసారాన్ని త్యజించక తప్పదు. అరణ్యాలకుపోవాలన్నా డబ్బు అవసరం! (చూరులో నుంచి తాను తెచ్చిన మనీపర్సు తీసుకుని) ఇదే నా కర్తవ్యము. కార్య రంగంలోకి ఉరుకుతున్నాను. (బుద్ధుడి మాదిరిగానే వెనక్కు తిరిగి చూస్తూ కుటీరత్యాగం చేస్తాడు. బయట గాలీవానా. అలానే చిత్రవున్న చెట్టు కిందికివచ్చి నిలబడతాడు)

చిత్ర—ఎవరు నువ్వు ?

రహీ—దిక్కులేని పచ్చిని.

చిత్ర—ఈ గాలీవానలో యెందుకు తిరుగుతున్నావు ?

రహీ—తలదాచుకోటానికి చోటులేక ! (మెరుపు మెరుస్తుంది)

చిత్ర—ఎవరు? మా రహీమా! చెప్పకుండా పోయావేం? ఇన్నాళ్లనుంచీ యెక్కడున్నావు ? ఇంటికి కెళ్ళుదాముర! (రెండు చేతులూ పట్టుకుంటుంది. రహీం మళ్ళీ వాళ్ల చేతులోకివచ్చి పడ్డందుకు

అల్లాని తిట్టుకుంటూ వుంటాడు) రహీం! నాన్న చనిపోయినాడుగా!

రహీం—(ఆశ్చర్యంతో) ఎప్పుడూ?

చిత్ర—నువ్వు వెళ్లిననాడే! యెవరో చిన్నయ్యగారి కాళ్ళుకూడా విరగగొట్టారు. ఇక నాకు దిక్కెవ్వరు రహీం?

రహీం—అల్లా వున్నాడు అన్నిటికీ! మీరేమీ దిగులు పడబోకండి. నేను బండి తెస్తాను, మీ రిక్కడే ఉండండి! (చిత్ర వద్దన్నప్పటికీ రహీం వెళ్ళిపోతాడు.)

*                    *                    *

(పోలికి మెలకువ వస్తుంది, ప్రక్కలో రహీం వుండడు. ఒకమాటు బయటికివచ్చి తొంగిచూసి పిచ్చిదానిలాగా గుడిసెలో తిరుగుతూ) పోయాడు! మోసగించిపోయాడు! ఇక రాడు, తిరిగి రాడు! (చూరులో చెయ్యిపెట్టి) పోయింది. నా సర్వమూ పోయింది! (కూలబడుతుంది)

*                    *                    *

(చిత్ర చెట్టుకిందనించి లేచి) ఇక రాడు, తిరిగి రాడు! ఉడిగింది నా ఆశ ఉడిగింది!

*                    *                    *

(పార్థసారథి-చిత్ర యింటినుంచి బయలుదేరుతూ) దక్కదు, ఇకనాకు దక్కదు. తీరినట్టే, నా ఆశ తీరినట్టే!

*                    *                    *

(గిరి ఆస్పత్రి డాక్టరుతో) తప్పను, కాలుతీయక తప్పదు! ఇంక నన్నెవరు చూస్తారు? (మంచంలో పడతాడు)

*                    *                    *

(హేమ మూర్ఛనుంచి లేచి) ఎవరు చూస్తారు? ఇంక నన్నెవరు చూస్తారు? ఇక నాకు దిక్కెవ్వరు?

కథ మంచి టెంపోలో నడుస్తూ ఠక్కున ఆగింది.

# ఉత్తరుడు

భర్త ఆఫీసునుంచి సాయంత్రం యింటికి చేరుకునేవరకు భార్య పిల్లవాణ్ణి చేతికిఅందిస్తూ, మనింట్లో అద్దెకున్నావిడనగలుదాచి పెట్టమనిఅడిగింది; ఊళ్ళో దొంగలుపడుతున్నారటగా!'అన్నది.

'నువ్వేమన్నా ?' అన్నాడు భర్త పిల్లవాడికి చక్కిలిగిలి పెట్టి నవ్విస్తూ.

'వల్ల కాదన్నా, ఇంకేమంటాను ! మా ఆయన అసలే—' భర్త ముఖం వంకచూసి భార్య నచ్చుకోట్టుతూ—'గాభరా మనిషి. ఇతరుల వేవీ నెత్తిన పెట్టుకోరమ్మా' అన్నాను.

'గాభరామనిషినా! నేను?' అన్నాడు భర్త కోపంతో— 'గాభరా అంటే ?' — — 'గాభరా అంటే యింకేముంది ? కాస్తైకు గంపంతచేసి వూరక అల్లకల్లోల మవటం !'

'అంటే భయపడతాననేగా నీ వుద్దేశం ?' పిల్లవాణ్ణి విసురుగా భార్యచేతికిస్తూ అన్నాడు — 'మగదిక్కున్న కొంప, ఇనప్పెట్టికూడా వున్నదని ఆవిడే దాచుకోనువస్తే నన్ను పిరికిపందను చేస్తావా , ఆమెముందు ?'

'రామ! రామ ! నేనన్నదాంటో ఆ అర్థ మెక్కడున్నదండీ?

'మరి నువ్వన్నదానికి అర్థమేమిటి?' అన్నాడు భర్త గట్టిగా.

'కాస్త మెల్లగా మాట్లాడండి !' భార్య నెమ్మదిగా అన్నది—"ఊళ్లో దొంగలు పడుతున్నప్పుడు పొరుగువాళ్లవి కూడా మననెత్తి నెందుకు పెట్టుకోవాలని అట్లా అన్నాను.'

'దొంగలా! మనింటికి?' భర్త యింకా బిగ్గరగా అన్నాడు- 'ఎవరి గుండెలు పెట్టుకుని ? ఆఖరికి మన ఇంటి పక్కగానన్నా

పోతావూ ? అబ్బాయిని యిట్లా యిచ్చిపో !' అని, పిల్లవాణ్ణి తీసుకుని ముద్దుపెట్టుకొని అన్నాడు—'మనయింట్లో వున్నవాళ్ల కి మనం సహాయం చేయకపోతే, ఎవరుచేస్తారు ?'

భార్య వెళ్ళిపోయింది.

* * *

రాత్రి పన్నెండుగంటలు కావచ్చు. చలికాలం. దానికి తోడుగా వాన తుంపరకూడా పడుతూ వున్నది. భర్త క్రింద గదిలో పండుకొని గురకపెడుతున్నాడు — కొలిమి తిత్తుల మాదిరిగా వున్నది బుస ! దగ్గరలోనే ఇంకో మంచంమీద భార్య పండుకొనివున్నది. భర్తకు ఎందుకు వచ్చిందో, వాక తుమ్ము వచ్చింది. మెలకువ రావటంతో పాటు, మేడమీద ఏదో చప్పుడుకూడా వినపడింది. రెండు మూడుసార్లు ఆవలించి 'ఇదిగో, నిద్రపోతున్నావా ?' అని భార్యను పిలిచాడు.

సమాధానంలేక పోయేటప్పటికి మళ్ళీ పిలిచాడు—'అబ్బ, ఎంత మొద్దునిద్ర !...మాట్లాడ కూడదని పంతమూ ఏమిటి ?'

మళ్లీ జవాబు లేదు. బిగ్గరగా దగ్గి — 'ఇకనన్నా లేస్తావా ?' అన్నాడు.

దుప్పటి ముసుగు తీయకుండానే భార్య గర్జించింది— 'ఏమిటీ గోల ! నిద్రేమన్నా పోనిస్తారా లేదా ?'

'ఏమిటి నీ ధుమ ధుమలు?' భర్త విసుక్కుంటూ అన్నాడు —'నిన్ను ఎవరు నిద్ర పోనివ్వటం లేదు ?'

'మీరే! ఇంకెవరు?' భార్య మొఖంమీదనుంచి ముసుగు తీసి అన్నది—'మీ గుర్రుకు యింకా నిద్రకూడా పడుతుంది! చెప్పండి, ఏం చెపుతారో ?'

'నీకేమన్నా వినపడిందా?'

'ఏమిటీ?'

'పైన గదిలో ఏదో చప్పుడయింది!'

'అయితే పోయి చూసి రా రాదూ?'

'ఎవరు?' భర్త నిట్టూర్చి అన్నాడు — నేనా, పైకి పోయేది?'

భార్య మోచేతిమీద భారంవేసి పైకిలేచి — 'మీరు కాకపోతే యింకెవరు?' అన్నది.

'నీకు మతేమన్నా వుందా, పోయిందా?'

'ఎందు కని?'

'పై గదిలోకి దొంగ వచ్చాడని నా నమ్మకం!'

'అయితే వెంటనే లేవండి! ఆమూలనే వుంది కర్ర.'

'ఉంటే ఏం చేయమంటావు?'

'అక్కర్లేకపోతే లాంతరు తీసుకునే పోయి చూసిరండి!'

'నీకు తలకాయ వుందా లేదా?' అన్నాడు-భర్త గంభీరంగా 'నువ్వుపో! నేను మెట్ల దగ్గరే నిలబడి వుంటా. ఇటుగనక ఎవడన్నా వచ్చాడా - ఒక్క దెబ్బకి బుర్ర రామకీర్తన పాడిస్తా!'

'మీరు గాజు లెందుకు తొడుక్కోరూ?' అన్నది భార్య కస్సు మంటూ—'లేస్తారా, పొరుగావిడను పిలవ మంటారా?'

'పొరుగావిడ నెందుకూ పిలవటం?'

'మీరు లేవటం లేదనే! రామ, రామ! ఇటువంటి పిరికి పందలు పగవాళ్ల యింట్లోకూడా పుట్టకూడదు బాబూ!' అని భార్య విసుక్కున్నది.

'పిరికి పందనా? నేను?' అంటూ భర్త లేచి కూర్చున్నాడు. తర్వాత కాస్త దగ్గి గొంతు సరిచేసుకొని — 'పైకి పోవటానికి నాకేమీ భయంలేదు......' అన్నాడు.

'మరెందుకు వెళ్ళరూ?' అన్నది భార్య మధ్యనే.

'దొంగ ముండాకొడుకు ఎవడన్నా పొరపాటున పైనివుంటే ఒక్క దెబ్బకు బుర్ర బద్దలుచేస్తాడు!'

'మీరు కూడా కర్ర తీసుకునే వెళ్లరాదూ?'

'కర్ర తీసుకునే వెళ్తా' అన్నాడు భర్త నిరాశ పుట్టిపడే స్వరంతో—'నా ప్రాణా లున్నంతకాలమే ఈ యింటి గౌరవమూ, కళాకాంతులూ. ఇక నీ...'

భార్య చెప్పనివ్వకుండానే—'లేస్తారా, పొరుగావిణ్ణి పిలవమంటారా?' అన్నది.

'ఊఁ, లేస్తున్నాగా!' అన్నాడు భర్త చాలాదీనంగా —. 'కాస్త దేముడికన్నా వెరువు! త్వరగా ఎల్లుం లెమ్మంటూ? ఎన్నడులేని చలికూడా ఇవ్వాళే దాపురించింది! న్యుమోనియా వస్తే?' తర్వాత పైవంక చూస్తూ—'మళ్ళీ చప్పుడేమీ వినపడటంలేదు—బహుశా నేనే భ్రమపడి వుంటా!' ముసుగు పెట్టుకొని పండుకొంటూ — 'నువ్వుకూడా పండుకో, ఏం ఫరవా లేదులే!'

* * *

కాసేపు వున్నాక మళ్ళీ అట్లాంటి చప్పుడే వినిపించింది.

'మీకేమన్నా వినపడిందా?' భార్య అడిగింది.

'నిద్రపోనిస్తావా లేదా? వొకసారి చెప్పలాఏం ఫరవాలేదని!'

'మీరు చెప్పితే ఏమయినట్లు?'

'నేను చెప్పితే ఏమీ కాకపోతే నువ్వు చెప్పితే. నేను లేవనే లేవను?'

'ఇదిగో లేవండీ! వృథాగా మీాయిల్లు ఎందుకు దోపిడి చేయించుకుంటారు?'—అన్నది భార్య బతిమాలుతూ.

'ఓహో!' అంటూ భర్త ముఖంమీాదనుంచి ముసుగు తీసి 'ఇది నాయిల్లు ఎప్పటినించి అయింది? నిన్నటిపరకు నువ్వేగా యీ యింటికి పెత్తనగత్తెవి!' అన్నాడు.

'మీారు యిట్లాగే మాటల్లో గడపుతారు; పొరుగావిడకు చెప్తాను ఎవరినన్నా మగవాళ్ళని పంపమని!'

'నేనేం మగాణ్ణి కాదూ?'

'అయితే మరెందుకు లేవరూ?'

'లేస్తున్నాగా! అంత బిగ్గరగా అరవటం ఎందుకు? ఈ గోలకి చుట్టు పక్కల వాళ్లంతా లేస్తే దొంగకూడా పారి పోవచ్చు!'

'అట్లాయితే త్వరగా లేవండి!"

భర్త దుప్పటితీసి దూరంగా పారేసి అడిగాడు— 'ఇప్పు డేం చేయమంటావు? నువ్వుకూడా సలహా చెప్పూ?'

'లాంతరు తీసుకుని పైకిపోయి చూసి రండి!'

'దొంగలు ఎత్తుకు పోటానికి పైనేముందీ ముల్లె? పైగా దొంగలు పడ్డసంగతి పొరుగాళ్ళకు తెలిసిందంటే, తెల్లారే వరకే వూరందరి నోళ్ళల్లో మనపేర్లు నానుతై. నా మాట విని నువ్వు మెదలకుండా వూరుకో! దొంగ, వచ్చినవాడు వచ్చినట్టుగానే వృత్తచేతులతో పోతాడు.—వచ్చినట్లు ఎవ్వరికి కూడా తెలియదు!'

భర్త మళ్లీ ముసుగుతన్ని పండుకొన్నాడు. కాసేపటికి తిరిగి అదేచప్పుడు వినపడింది. 'మీకేం తీరికగా పండుకున్నారు! నేను పొరుగావిడను పిలుస్తున్నాను — పాపం ఆవిడ నగలు కూడా వున్నయి' అన్నది.

'నీ పొరుగువాళ్లు బుగ్గికానూ!' అంటూ భర్త లేచి కూర్చున్నాడు 'రేపటిదాకా నేనుబతికుంటే నీ పొరుగాళ్ళని వెళ్ళగొట్టి కాని కాఫీముట్టను! ఇక చెప్పు! ఏం చెప్తావో?-పైకి పొమ్మంటావా? సరేపోతా! కాని ఒకమాట నీ ఎదటే చెప్తున్నాను- నీకు నామీద పూర్వం మాదిరి ప్రేమ లేనే లేదు!' అని నిట్టూర్చి అన్నాడు—'నా జీవితమంతా, నిన్ను క్షేమించటం లోనే, పాడుచేసుకున్నాను. పైగా నువ్వే నన్ను మృత్యువు నోటిలోకి పంపాలని చూస్తున్నావు! తప్పుతుందా? ఆలాగే పోతాను! పైన ఎవడన్నా దగుల్బాజీ, ఫుండాకోరు వున్నాడంటే, నేనురావటం చూడగానే తలుపుచాటున దాక్కుంటాడు. నేను లోపల అడుగుపెట్టంగానే రుస్తుంమాదిరిగా కర్రతో ఒక్కటే పెట్టు పెడతాడు, నా నెత్తిమీద! నేనట్లాగే విరుచుకుని కిందపడతాను. తర్వాత వాడు ఏమి చేస్తాడో దేముడికే తెలియాలి! — నొసట రాసింది ఎవడు తప్పించుకున్నాడు? అబ్బాయిని వొక మాటిలాయివ్వూ.... చందమామ మాదిరి ఎంత చక్కగా వున్నాడు? అంతా నా మొహమే! కాస్త పెదాలు, ముక్కులోమాత్రం నీ పోలిక లున్నాయి. ఆ పెదాలు చూడు, గులాబి పూలెల్లే ఎంత మెత్తగా వున్నాయో!... నిజంగా, ఇవ్వాళ బట్టల కొట్టులో మంచిచీరె ఒకటి చూశాను—బెంగుళూరుపట్టుది. సీతోడు!

రేపు ఉదయాన్నే నీకు తెద్దామను కున్నాను. చిట్టికికూడా లాగుచొక్కా కుట్టించుకు వచ్చేవాణ్ణి. ఏంలాభం, నా కోరిక కొండెక్కింది! నేను పోయేవాడి౹ ఎట్లయినా పోతున్నాను, నువ్వన్నా పిల్లల్ని కాస్తే కనిపెట్టి......'

భార్య మధ్యలోనే—'వెళ్తారా? పొరుగావిణ్ణి పిలవ మంటారా?' అన్నది.

'ఊఁ, వెళ్తున్నాగా!...ఇక అంతా దేముడిమీదే భారం! నాయనా నిన్నుకూడా దేముడికే అప్పగించారా!' అని అబ్బాయిని భార్యచేతికిచ్చి వొకచేత్తో లాంతరూ రెండో చేత్తో కర్రా తీసుకొని మెట్లడాకా పోయి, భార్యవైపుచూసి 'నువ్వుకూడా రా రాదూ. ఎట్లయినా వొకరి కొకరు తోడు వుంటం మంచిది!' అన్నాడు.

కాని భార్య గుడ్లు ఉరిమేవరకూ మెల్లెకుంతూ, లేని నౌకర్లను పిలువ నారంభించాడు—'అరే, వెంకాయ్! బరిసె బాగా పట్టుకో! ఒరే, రాముడూ! గొడ్డలి భుజాన పెట్టుకో! అరే నాయనా! నా వెనకాలే వుండు; నా చేతిలో తుపాకి కన పడటంలా? నీకేం భయం లేదు!'

ఇట్లాగే కేకలు వేసుకొంటూ మెట్ల తలుపు దగ్గరికి చేరి కంపిస్తున్న శరీరాన్ని ఎట్లాగో గోడకు చేరవేశాడు. భార్యకు పాపం జాలివేసింది. ఆమెకూడా తలుపుదగ్గరికి వచ్చి 'ఎందుకూ మీ రిక్కడ నిలుచుంది? తలుపు తెరవండి!' అన్నది.

వణుకుతున్న చేతులతో భర్త తలుపు తెరచి చూచాడు— వాళ్ళ పెంపుడు పిల్లి ఎలికనుపట్టి చాపమీద పెట్టి ఆడు కుంటూ వున్నది!

## చలంగారి యితర పుస్తకాలు

## పాపం !!!

విశేష విమర్శనలకు గురి అయిన కథా సంపుటి!!

## అరుణ

విచిత్రమైన వ్యక్తుల సమ్మేళనతో అల్లబడిన నవల. అరుణ చచ్చిందా? చావలేదంటాడు రచయిత.

## హంపీ కన్యలు

వలపుకూ ఏవగింపుకూ మధ్యఉన్న మార్జిన్ ఎంత?... మీరెప్పుడయినా గమనించారా?

## మంగమ్మ

అద్భుతమయిన సన్నివేశాలతో కూడిన నాటకం. ఒకతప్పు ఇంకొక తప్పుకు దారితీస్తుంది! గయ్యాళి తల్లి. సాధువైన పెంపుడుకొడుకు. విశృంఖలుడైన అసలుకొడుకు ... వీరందరిమధ్యా నలిగి చస్తుంది కోడలు కామాక్షి !

## పాఠకులకు విన్నపము

మా ప్రచురణలు ముఖ్యమయిన పుస్తక విక్రేతలు, న్యూసు ఏజంట్లు అందరివద్దా దొరకును. ఒకవేళ దొరకనిచో మాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. 6-0-0 విలువగల పుస్తకములు ఒకేమాటు తెప్పించుకొనువారికి పోస్టుఖర్చులు మేమేభరిస్తాము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | పాపం!!! | (కథలు) | 'చలం' | 0-12-0 |
| 2. | హంపీ కన్యలు | (నవల) | .. | 0-12-0 |
| 3. | అరుణ | .. | .. | 0-12-0 |
| 4. | బ్రాహ్మణీకం | .. | .. | 0-12-0 |
| 5. | ఆనావీలరు | .. | సౌరీస్ | 0-12-0 |
| 6. | మారుపేర్లు | .. | కుటుంబరావు | 0-12-0 |
| 7. | కులంలేని మనిషి | .. | .. | 0-12-0 |
| 8. | బడదీదీ | .. | శరత్‌బాబు | 0-12-0 |
| 9. | పతివ్రత | .. | .. | 0-12-0 |
| 10. | పల్లీయులు | .. | .. | 1 - 8-0 |
| 11. | దేవదాసు | .. | .. | 1 - 8-0 |
| 12. | పరిణీత | .. | .. | 0-12-0 |
| 13. | తోకచుక్క | (కథలు) | 'చక్రపాణి' | 0-12-0 |
| 14. | పాతమంగలి | .. | .. | 0-12-0 |
| 15. | వనఫూల్ రచనలు | .. | .. | 0-12-0 |
| 16. | పరశురాం కథలు | .. | .. | 0-12-0 |
| 17. | బెంగాలీ కథలు | .. | .. | 2 - 0-0 |
| 18. | మైత్రా కథలు | .. | .. | 2 - 0-0 |
| 19. | మూగజీవాలు | .. | గోఖలే | 0-12 0 |
| 20. | కదంబం | .. | నార్ల | 0-12-0 |
| 21. | రూం టు లెట్ | .. | బాలక్రిష్ణశాస్త్రి | 0-12-0 |
| 22. | మంగమ్మ | (నాటకం) | 'చలం' | 1 - 0-0 |
| 23. | పలితకేశము | (కావ్యం) | దువ్వూరి | 1 - 0-0 |
| 24. | కడలి పొంగులు | .. | సముద్రులు | 1 - 0-0 |

యువ బుక్ డిపో: మద్రాసు

# కొత్త ప్రచురణలు

కొడవటిగంటివారి నవల

## మారుపెళ్ళి

నార్లవారి కథలు

## [illegible]

మా. గోఖలేగారి కథలు

## [illegible]

దువ్వూరి రామిరెడ్డిగారి కావ్యము

## పలితకేశము

చలంగారి నాటకం

## మంగమ్మ


యువ బుక్ డిపో — మద్రాసు & తెనాలి



YUVA ...... TOKA CHUKKA